# శ్రీ గణేశ్వరీయము

గ్రంథకర్త:

శ్రీ కన్నేపల్లి సాంబశివ రఘురామస్వామి

 [మూల్యము రు 2/-



గ్రంథకర్త

శ్రీ కన్నెపల్లి సాంబశివ రఘురామస్వామి

# విజ్ఞప్తి

కమనీయ కవితా విశారదులును, పూజ్యులును నగు నా జనకులు శ్రీ కన్నేపల్లి సాంబశివ రఘురామస్వామిగారు రచించిన యీ గణేశ్వరీయ మను ప్రబంధము నామూలాగ్రముగ సరిచూచి, సంస్కరించి, యన్నింటి కన్న మిన్నగ నీ ద్వితీయ ముద్రణము నద్వితీయ పీఠికచే నలంకరించిన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి నే నత్యంతము కృతజ్ఞురాలను. మఱియు నీ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రించిన శ్రీ వై. యస్. శాస్త్రి గారికిని, ముద్రణ కాలమున గ్రంథమును సరిదిద్ది సంస్కరించిన శ్రీ విద్వచ్ఛిరోమణి టి. వి. రంగాచార్యులవారికిని నా కృతజ్ఞత.

మా నాయనగారి కృతి దేశమున వ్యాప్తమై, విద్వజ్జనామోదము బడయుటయే నా యాశయముగాని వేఱొండు కాదు. ఆంధ్రమహాజనులు దీని నాదరించిన నదియే నాకు పదివేలు.

వారణాసి వరలక్ష్మి.

# గ్రంథ సంస్కరణము

గణేశ్వరీయ మను నీ ప్రబంధము మొదట క్రీ. శ. 1923 సంవత్సరమున మదరాసులో 'ఇండియా ప్రింటింగ్ వర్క్సు' ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. అందులో గ్రంథావతారిక, ఆశ్వాసాద్యంత పద్యములు, ఆశ్వాసాంత గద్యయుఁ గలవు. పూర్వ కవి సంప్రదాయము ననుసరించిన యీ గ్రంథము నవీన రీతిని పాఠకలోకమున కందుబాటులో నుండుటకు ప్రకృత ద్వితీయ ముద్రణమున నీ క్రింది సంస్కరణములు గావింపఁబడినవి.

1. ఆశ్వాస విభాగములు 1, 2, 3, 4 అను సంఖ్య గల శీర్షికలుగా విభాగింపఁబడినవి.
2. అవతారిక, ఆశ్వాసాద్యంత పద్యములు, ఆశ్వాసాంత గద్యలు విడువఁబడినవి.
3. కథాభాగమునందును, వర్ణనలయందును నేఁటి యభిరుచులకు విరుద్ధముగ నుండు శృంగార వర్ణనాంశములు అనగా ప్రథమ ముద్రణము ప్రథమాశ్వాసములోని 3 పద్యములు, ద్వితీయాశ్వాసములోని 4 పద్యములు విడువఁబడినవి.

సంపాదకుఁడు

# పీఠిక

ఈ నాఁడు మనము ప్రాచీనాంధ్రసాహిత్య కావ్య ప్రబంధములను కేవలము సారస్వత విమర్శక దృష్టితోడనే పరిశీలించుచుండుట సర్వ విద్వజ్జన విదితమై యున్నది. పాశ్చాత్య విమర్శన పథకము ననుసరించి, పట్టువడిన నవ్య విమర్శన సంస్కారమువలన మనము మన సాహిత్యముయొక్క పైపై మెఱుఁగుల నెఱుఁగఁగలుగుదుమేమో కాని, అతి గంభీరమును, ఆ సాహిత్య సౌధ నిర్మాణమునకు మూలాధారమును నగు ఆధ్యాత్మిక యోగ విద్యా మత సంప్రదాయ విశిష్టత నెంతమాత్రమును గ్రహింపలేము.

భారతీయ దేశభాషలలో, భారతీయ వాఙ్మయమునకు మూలమైన సంస్కృతభాష కత్యంత సన్నిహితత్వము గలిగి, ఆ భాషావర్ణ సమామ్నాయమును సంపూర్ణముగ నాకళించుకొన్నది ఆంధ్రభాష. కేవలము దేశీయమును, స్థానికమును నగు తెనుఁగు భాష సార్వదేశికమై, సార్వజనీనమై, సర్వవ్యాపకమై, సకల విజ్ఞాన భాండారమైన సంస్కృత భాషతో నవినాభావ సంబంధము గలదయ్యె, గంగా యమునా తరంగిణులవలె సమ్మేళనము జెంది యేకైకమైన 'ఆంధ్ర భాషా' వాహినిగా, ఆంధ్ర క్షేత్రమునఁ బ్రవహించి దానిని పునీతము గావించినది. ఇట్టి యపూర్వ భాషా సమ్మేళన సన్నివేశముచేత సంస్కృతాంధ్రోభయ భాషాకోవిదులైన ప్రాచీనాంధ్రకవులు శ్రుతిస్మృతిపురాణేతిహాసకావ్యనాటకాలంకారాది సమస్త వైదిక లౌకిక సంస్కృత వాఙ్మయమును, అందు నిక్షిప్తమైన సమస్త హైందవాధ్యాత్మిక మత సంప్రదాయములను నాంధ్రభాషాసాహిత్యమున ననువదించి, విపులముగ విస్తరింపఁజేయుట కవకాశము గలిగినది.

వాస్తవముగ నిట్టి మహదవకాశము మన యాంధ్రభాషా సాహిత్యమునకే కాని దక్షిణ హిందూ దేశభాషలలో మఱి యేభాషకుఁగాని, భారత దేశీయేతర ప్రాంత భాషలకుఁ గాని లేదనియే చెప్పవచ్చును.

ఈ కారణము చేతనే యాంధ్ర వాఙ్మయము అఖిల భారతీయ వాఙ్మయమునకు, మతసంప్రదాయములకు ప్రతిబింబమని చెప్పనొప్పును. మన తెలుఁగు సాహిత్యము నామూలాగ్రముగ, నిర్ణిద్రముగ, నిశితముగఁ బరిశీలించినచో పై వాక్యము సత్యమని నిర్ధారించుట కవకాశమున్నది.

భారతీయ మత సంప్రదాయములలో త్రిమూర్తుల వెనుక గణపతి యర్చనయు మనకు ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. తెలుఁగు కావ్య ములో నియతముగ "ఇష్ట దేవతాస్తుతి" యొకటి గలదు. కవి తాను స్వాయ

ముగా రచించినను, నితరుల కంకితమిచ్చినను, నిష్టదేవతాస్తుతి చేయుట యాంధ్ర కావ్యరచనా సంప్రదాయములలో నొక ముఖ్యాంగముగా పరిణమించినది.

"హరిహరాజగజాననార్క షడాస్యమాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతా తతికి న్నమస్కృతిచేసి" అని నన్నయ ప్రారంభించినాఁడు. నన్నయనాఁటి యీ పద్ధతి నిన్నటి వఱకును నాచరణలోనున్నది. శైవ వైష్ణవ మత భేదములచే కవులు వారి వారి కుపాస్య దేవతలను ముందు స్తుతించినను, తక్కిన దేవతాస్తుతులను కూడ చేసి, యీ యాచారమును పాటించుచునే యుండిరి. అందు ముఖ్యముగా, విఘ్నముల నివారించు దైవముగాన, గణపతి స్తవమును ప్రత్యేకముగా చేయుట పరిపాటి యైనది. ఆంధ్ర వాఙ్మయమున నా గణపతిస్తుతులను* పరిశీలించినచో, మన కవులు గణపతికి సంబంధించిన

---

* ప్రాచీన కాలమునుండి నవీన కాలము వఱకుఁ గల తెలుఁగు గ్రంథములలోని గణపతి స్తవములను నేను సేకరించి సంధానించితిని. వానిని వేఱుగా గ్రంథరూపమున కాలాంతరమున, స్థలాంతరమునఁ బ్రకటింతును. అయినను మచ్చున కీ క్రిందిపద్యముల నుదాహరించుచున్నాను.

ఉ. అరుదుగ వామభాగ లలనాచలనాకలనాత్ముఁడైన యా
హరుగురుఁగాంచి తానును తదాకృతియాగతి నేకదంతుఁడై
కరికరిణీ గుణంబులు మొగంబున మించ జగంబులేలు నాం
తర కరుణాసనాథు గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్.

(మూర్తికవి నరసభూపాలీయము)

చ. తనయుని నొక్క యెత్తుననె దనుజయు న్నిటలాత్ముఁడున్ ముదం
బున నిరు చెక్కులం గొనుచు ముద్దుగొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి యత్నవిహీన పరస్పరాస్య చుం
బనములు తల్లిదండ్రులకు పన్నగఁగూర్చు గజాస్యు నెన్నెదన్.

(అప్పకవి : అప్పకవీయము)

ఉ. మంచముఁజేరి శంభుఁడు కుమారుని తొట్లనుబెట్టి నాదు చే
లాంచల మేలపట్టుకొనె దమ్మ కడం జనుమన్న భక్ష్యమి
మ్మంచని పోర చంద్రకళ నక్కఱ నైనిడ కేల ద్రోయుచున్
ద్రుంచిన దోసె యంచనెడు తోరపు బొజ్జగలాని గొల్చెదన్.

(పుదుకోట రఘునాథ నాయకుని పార్వతీపరిణయము.)

సమస్త విషయములను,—అనఁగా అత్యంత ప్రాచీనమగు ఋగ్వేద కాలము నుండి, నేఁడాచరణలోనున్న గణపతి వ్రత కల్పము వఱకుఁ గల పురాణ చరిత్రను ఆ పద్యములలో నెంతగా సూచించియున్నారో తెలియఁగలదు. కొన్ని గజాననుని పుట్టుక; కొన్ని యాతని బాల్యచేష్టలు; కొన్ని యాతని గుణవిశిష్టత : సంప్రదాయములు; కొన్ని యాతని స్వరూప నిరూపణము-వానికి సంబంధించిన కథలు; కొన్ని యాతని విఘ్నరాజత్వము. బహుమనోహరముగ, చమత్కారముగ రచితములైన యీ గణపతి స్తుతి పద్యములను మనము తఱచి చూచిన, నిష్టదేవతాస్తుతియందలి పద్యముల యుత్కృష్టతను, మన కవుల మత సంప్రదాయాభినివేశమును గ్రహింపఁగలుగుదుము. ఇష్ట దేవతా స్తుతియందు సర్వకవుల కిష్టుఁడైన గణపతి యుదంతము 'గణేశ్వరీయ' మను నీ ప్రబంధమున నిబంధింపఁబడిన విషయము నీ పీఠిక మూలముగా పాఠకలోక మున కెఱుకపఱచుచున్నాను. తొలుత గణపతి తత్త్వమును గూర్చి కొన్ని యంశములు నివేదింతును.

## గణపతి వాగధిష్ఠానదేవత

నిరుక్తమున యాస్కాచార్యులవారు 'గణ' శబ్దమును వాక్కునకు ముప్పది యెనిమిదవ నామముగా పరిగణించినారు. ముప్పదియవ నామము ఘోషము. స్కందస్వామి దానికి "ఉచ్యతే ఇతి వాక్; ఇంద్రియం, తత్కార్యః శబ్దో ప్యుచ్యతే ఇతి వాక్; తదధిష్ఠాత్ర్యపి దేవతా వాగ్గణిష్యతే" అని వ్యాఖ్యానము వ్రాసి యున్నాఁడు. క్షీరస్వామి "గణః గణనాత్ సహి గణ్యతే వసుసంయోగాత్ గుణశ్చ గుణోపి గణనాదేవ అసావపి హి గణ్యత ఏవ—ద్విగుణః త్రిగుణః" అనినాఁడు. ఆ కారణము చేత గణపతి వాగధిష్ఠాన దైవతము, శబ్దగణ్యుఁడు నై ప్రకాశించుచున్నాఁడు.

## గణపతి కవి

గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవస్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శ్రుణ్వ న్నూతిభిః సీద సాదనమ్ ॥

(ఋగ్వేదము 11-28-1)

పై ఋగ్వేద సూక్తము ననుసరించి గణపతి కవి. కవీనాం కవి. "ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే" అను భవభూతి కృతోత్తరరామచరిత్ర నాటక నాందీ శ్లోకమునకు కొందఱు వ్యాఖ్యాత లిచట కవిశబ్దము గణపతి మంత్రసూక్తములోని దని, అది గణపతి స్తవ మని వ్యాఖ్యానము చేసియున్నారు. భవభూతి మాలతీమాధవ నాటకము నాందీ శ్లోకమును గణపతి స్తవమే యగుటచే పై వ్యాఖ్యాతల యభిప్రాయము సమంజసమై యున్నది. ఇట్లు సాహిత్యముననేకాక సంగీతమునకూడ ముందు గణపతిప్రార్థన చేయుట యాచారమై యున్నది.

## గణపతి లేఖనసంప్రదాయ సృష్టికర్త

లేఖనమునకు ముందు జరుగవలసినది అక్షరాభ్యాసము. మన యాంధ్ర దేశమందు 'ఓం నమశ్శివాయ' మంత్రముతో అక్షరాభ్యాసము గావింతురు. కాని మళయాళ దేశమునందును, ఉత్తర హిందూస్థానమందును "శ్రీ గణేశాయ నమః" అను మంత్రముతో నక్షరాభ్యాసము చేయింతురు. దీనికి కారణము గణపతి వాగధిష్ఠానదేవత, కవి యగుటయే కాక, వర్ణింప వీలులేనంత వడివడిగా వ్రాయఁగల లేఖన నైపుణ్యము గలవాఁడు. మహాభారతమును రచించిన వేదవ్యాసునికి గణాధిపతి లేఖకుఁడు. ఈ విషయము సంస్కృత భారతమున నిట్లున్నది.

"వ్యాస మహర్షి భారత గ్రంథమును బుద్ధిస్థముగాఁ జేసికొని దీనిని శిష్యులకు అధ్యాపనము చేయుట యెట్లని యాలోచించుచుండ నది గ్రహించి బ్రహ్మ మహర్షికి ప్రత్యక్షమై పూజలంది సుఖాసీనుఁడై యుండ, వ్యాసమహర్షి తాను బుద్ధిస్థముగాఁ జేసి యుంచిన భారతమునందలి విషయమును సంగ్రహముగా వివరించి, "పరం న లేఖకః కశ్చి దేతస్య భువి విద్యతే"—తన గ్రంథమునకు లేఖకుఁడు మాత్రము లేఁడని చెప్పఁగా, బ్రహ్మ ఆ గ్రంథకర్తృత్వమును, మహర్షిని ప్రశంసించి "కావ్యస్య లేఖనార్థాయ గణేశః స్మర్యతాం మునే" (1-80)—గ్రంథమునకు లేఖకునిగా గణపతిని స్మరింపుము అని బోధించి వెడలిపోయెను.

తరువాత వ్యాసమహర్షి స్మరింపఁగానే గణాధిపతి ప్రత్యక్షమయ్యెను. మహర్షి తన భారతమున కాతఁడు లేఖకుఁడుగా నుండవలెనని కోరెను. గణపతి "యది వ్రాయునపుడు నాకలము: క్షణమైనను ఆగకుండెడుపద్ధతిని నీవు చెప్పఁ

గలవేని నేను వ్రాయుదును-యది మే లేఖినీ క్షణమ్ లిఖితో నావతిష్ఠేత తదా స్యాం లేఖకోహ్యాహమ్" అని చెప్పెను. (1-84.)

ఆ పై వ్యాసమహర్షి ఇట్లనెను: "త దేవమబుధ్వామాలిఖక్వచిత్. ఓ మిత్యుక్త్వా గణేశోఽపి బభూవ కిల లేఖకః" (1-85.)—నీ వర్థము చేసికొనుచు వ్రాసినయెడల నట్లే చెప్పెదనని ప్రతిజ్ఞ చేయ దాని కంగీకరించి గణపతి వ్రాసెను.

సంస్కృత మహాభారతమున పదార్థానుక్రమణికా ప్రతిపాదక ప్రథమాధ్యాయమున 79-85 శ్లోకములలోఁ గల ఈ గణేశ లేఖనవృత్తాంతము నన్నయభట్టారక రచిత భారత భాగమున లేదు. నన్నయభట్టారకుని కాలమునాఁటి మూలభారత ప్రతులలో నీ వృత్తాంతము లేకపోయి యుండ వచ్చు నని కొందఱు విమర్శకు లభిప్రాయపడిరి. కాని వారి యభిప్రాయము సరియైనది కాదని చెప్పవలసి వచ్చుచున్నది. నన్నయభట్టారకునికంటె నొక శతాబ్ది, అనఁగా క్రీ. శ. 940 ప్రాంతమున ప్రసిద్ధ సంస్కృతాలంకారికుఁడు, కవి రాజశేఖరుఁడు 'బాలభారతము' అను తన నాటక గ్రంథమున భారత సంహితకు గణపతి లేఖకుఁడని వ్యాసవాల్మీకిసంవాదములో వ్యాసుని చే చెప్పఁబడినట్లు వ్రాసెను.

"వినాయకో య శ్శివయో రపత్య
మర్థం పుమా నర్ధ మిభ శ్చ దేవః,
సవ_ర్తతే భారతసంహితాయాం
వృ_త్త_స్తపోభి ర్మమ లేఖకోఽత్ర."

అని యందు కలదు.

ఒకవేళ నన్నయనాఁటి సంస్కృత భారత ప్రతులలో కొన్నింటియం దిదియున్నను, లోకజ్ఞుఁడగు నన్నయ దీనిని గ్రహింపలేదని తలఁచుటయే న్యాయము. ఏలననఁగా, నన్నయ దృష్టిలో భారతము కేవలము ఇతిహాసము మాత్రమే కాదు ; అది పంచమ వేదము; భగవదంశసంభూతుఁడు, పారాశర్యుఁడు నగు వేదవ్యాసుఁడు విశ్వశ్రేయస్సు కొఱకు వివరించినది. వేదము నకుఁగల పర్యాయపదము లన్నియు వేదము శ్రవణమననిదిధ్యాసనాదులచే గ్రహింపఁదగినదని విస్పష్టము చేయుచున్నవి. శ్రుతి వినఁదగినది, ఆమ్నాయ

మభ్యసింపఁదగినది అను వ్యుత్పత్తుల ననుసరించి, పంచమ వేదముగా భారత మును తాను రచించునప్పుడు, నన్నయ, అది లేఖనమైనచో 'లోక సామాన్య గ్రంథము' అను నభిప్రాయమున కవకాశము కల్పించునని, గణ పతి లేఖనవృత్తాంతమును విడిచిపెట్టి యుండును. నన్నయ, భారత భాగ మున నెచ్చటను భారతము లేఖ్యమైనదని చెప్పలేదు. ఆ వెనుక రెండు శతాబ్దులకు వెనుక తిక్కన దీనిని "లేఖ్యంబైన ఆమ్నాయమున్" అని స్పష్టముగా చెప్పియున్నాఁడు. కాఁగా తిక్కన కాలమున కీ గణపతి లేఖన వృత్తాంతము మూల భారత ప్రతులలో కెక్కిన దని యూహింపవచ్చును. రాజశేఖరకవి పరంపరాయాతముగా వచ్చు జనశ్రుతిని గ్రంథస్థము చేసి యుండవచ్చును. దానిని తరువాతివారు మూల గ్రంథములో నా ఘట్టమున చేర్చియుందు రనుటయే సమంజసము. నన్నయ కాలమున జనశ్రుతిలో నున్నను దానిని గ్రహింపలేదనుటయే యతని లోకజ్ఞతకు తార్కాణ. *

## గణాధిపతి పూజ

భారత వర్షమున, భాద్రపద శుక్ల చతుర్థి దినమున ప్రతి పట్టణమున, ప్రతి గ్రామమున, ప్రతి గృహమున 'వినాయక వ్రతము' 'విఘ్నేశ్వర పూజ' అను పేరుతో జరుగుట సర్వజన విదితమై యున్నది. వేదమునకు 'ఓంకారము' (ప్రణవము) రీతిని, విశ్వసృష్టికి ప్రథమ సర్గమువలె, విరూ పాక్షుని సంధ్యా నృత్యమునకు నందీశ్వరుని నాందీ నినాదము విధమున, విశ్వశ్రేయఃకరమగు కావ్యమునకు శ్రీకారము భంగిని సమాచరణీయము లైన శతాధిక వ్రతములకే కాక, సకల శుభకార్యములకు గణాధిపతిపూజ ప్రారంభప్రక్రియ యైయున్నది. నేఁటి వ్రతకల్పములయందు వినాయక వ్రతమే అన్నింటికన్న ముందుగ పరిగణితమగుటకు నిదియే హేతువని చెప్పఁదగియున్నది. మరియు భారతవర్షమునం దన్ని దేశములవారును, అన్ని వర్ణములవారును అభేదభావమున నీవ్రత మాచరించుటచేత, నిది చాతుర్వర్ణ్యాది ప్రత్యేక సామూహికావస్థ లేర్పడకముందే, అనఁగా బహు ప్రాచీనకాలమునందే, ప్రచారములో నున్న ట్లూహింపవచ్చును.

---

*పూనాలో భండార్కారు పరిశోధనాలయమువారు ప్రకటించిన సంస్కృత మహాభారత సర్వంకష ముద్రణమున నాదిపర్వమున నీ గణేశ లేఖన వృత్తాంతము లేదు. ఆ గ్రంథ సంపాదకులు ప్రాచీనతర తాళపత్రప్రతు లలో నిది లేకపోవుటచే దీనిని ప్రక్షిప్త మనిరి.

గణాధిపతిపూజ క్షీరసాగర మధనకాలమునుండియు, ననఁగా కృత యుగమునాఁటినుండియు వ్యాప్తిలో నున్నట్లు మనకు తెలియుచున్నది. చింతామణి గణపత్యుపాసకుఁడగు శ్రీనాథ మహాకవి భీమఖండమునను, హరవిలాసమునను నీ పూజా విధానమును కల్పోక్త ప్రకారముగ వర్ణించి యున్నాఁడు.

భీమఖండమున—"దేవదానవులు క్షీరాబ్ధి మథించిన, నందు తొలు దొల్త హాలాహల ముద్భవించె ననియు, నప్పు డింద్రాది దేవత లందఱును నీశ్వరుని ప్రార్థింపఁగా హరుఁడు హాలాహలమును నొక ఘుటికగాఁ జేసి మ్రింగి, కుక్షిలో నున్న లోకములకు హాని గలుగకుండ, కుతుకమున కుత్తుకలో ధరించి, సర్వ లోకములను సంరక్షించెను.

ఆపైని శివుఁడే, అచ్చటి హరి విరించి పురందరాదుల నవలోకించి యిట్లనెను.

గీ॥ మనము విఘ్నేశు సేవింప మఱచినార
మతని సేవింపకున్న నేలా ఫలించు
నఖిల కార్యములును ? నవశ్యము ఫలించు
నర్థ కార్యార్థ మిభవక్త్రు ననుసరింప." (4-48)

ఇచట పరమేశ్వరుఁడే గణపతిని తొలుత పూజింపకుండ క్షీరసాగర మథన కార్యమునకు పూనుకొన్నందున హాలాహల ముద్భవించినదని, కార్య విఘ్నము కలిగినదని, కామితములు పడయలేదని, అతని పూజించినఁగాని కార్యములు సఫలముగావని చెప్పుటయే ఈ గణాధిపతి పూజావశ్యకతను, మాహాత్మ్యమును స్పష్టముగా ప్రకటించుచున్నది. అంత దేవదానవు లందఱును,

"...అంభోధితటోపకంఠమున దాక్షారామ మధ్యంబునన్
ఘనునిం దాండవ విఘ్ననాయకు మహాకాయున్, సముత్తప్త
చనసంకాశు ననేక రత్నఖచిత స్వర్ణాగ్ర సింహాసనం [కాం
బునఁ గూర్చుండఁగఁబెట్టి భక్తిపరతం బూజించిరవ్యగ్రులై.

ఆ సమయమున.

"జలకమార్చె బలారి సప్తగోదావర
సలిలధారా హేమకలశ సమితిఁ;
గర్పూర కస్తూరికా గంధసారంబు
నలఁదె వైవస్వతుం డంగకములఁ;
బ్రన్నఁగాఁ బెనగొన్న బ్రహ్మసూత్రంబుల
పసపూన్చి యర్పించె బ్రహ్మభవుఁడు;
పారిజాతక తరు ప్రసవ మాల్యంబులు
వక్షస్థలంబున వైచె శౌరి;
ధూమకేతుండు మహిసాక్షి ధూపమిచ్చె;
పూన్చె యక్షాధిపతి మణిభూషణముల;
నంధకాసురుఁ డిడియె దూర్వాంకురములు;
వీచెఁ బవనుండు కుంచియ విఘ్నపతికి."

ఇచట బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు, ఇతర దిక్పాలకులు, అంధకాసురాది దానవులు అందఱును నేకమనస్కులై గణాధిపతిని బూజించిన నాట నుండియు నాతని *వినాయకత్వమును, విఘ్నరాజత్వమును సార్థక్యము నందినవి.

అనంతరము — "మోదకాపూపపాయసఘృతమధుక్షీరశర్కరాసూప జంబూకపిత్థచూత ఖర్జూర కదళీ నారికేళ ఫలపుండ్రేక్షు సమన్వితం బుగా మహోపహారంబులఁ గల్పించి వేల్పులుం బ్రావేల్పులును ననల్ప

---

*వినాయక శబ్దమునకు వ్యుత్పత్తి రెండు విధములుగా నమరకోశమున నీయఁబడి యున్నది:

1. వినయతి శిక్షయతి దుష్టాన్ విఘ్నాంశ్చేతి వినాయకః—దుష్టులను, విఘ్నములను శిక్షించువాఁడు (నీజ్ ప్రాపణే).
2. విగతో నాయకః ప్రభు ర్యస్య సః స్వతంత్రత్వాత్ వినాయకః—స్వతంత్రుఁ డగుటవలన తనకు నితర ప్రభువు లేనివాఁడు. విఘ్నానాం రాజా విఘ్నరాజః—విఘ్నములకు రాజు. ప్రసిద్ధమే.

భావనా విశేషంబుల నశేషవిధంబుల మాపక వాహనునకు ప్రదక్షిణంబులు ప్రణామంబులుం జేసి, నలగొని క్రమ్మఱ పయోనిధిమథనమునకు ప్రారంభించిన—

"మందరాచల మంథాన మథ్యమాన
దుగ్ధపాథోధిలో సముద్భూతమయ్యె
బాలశశిరేఖ యసురులు వేలుపులును
నిచ్చి రవ్వస్తు వర్థి భీమేశ్వరునకు."

తొలుత బాలచంద్రరేఖ లభించినది. దానిని దేవదానవులు శివున కర్పింప నాతఁడు శిరమున ధరించెను. ఆ పైని తరువఁగా, నందు ధన్వంతరి, లక్ష్మి, చంద్రుఁడు, కల్పవృక్షము, అమృతకలశము లభించినవి. (88_92)

హరవిలాసమున క్షీరసాగర మథన ప్రారంభమునకు ముందే—

"అఖిల కార్య సమారంభణాదులందుఁ
బూజనీయుండు గావున బుద్ధిఁ దలఁచి
విఘ్ననాయకు నంబోధి వేలమీఁద
సురలు నసురులుఁ గొలిచిరి పరమభక్తి." (6–5)

"క్షీరాంభోనిధి సైకతస్థలమునన్ సింహాసనాసీనుఁగా
హేరంబున్ హరనందనున్నిలిపి ప్రత్యేకంబ దేవాసురుల్
గారామారఁగ నాచరించి రభిషేకం బుల్లసద్గంధక
స్తూరీసౌరభవాసితంబుల నదీతోయంబులం దోరమై."

ఇందును పూజావిధాన మిట్లు వర్ణితమైనది:

"అభిషేకానంతరమున
నిభరాజాస్యునకుఁ గట్ట నిచ్చిరి యదితి
ప్రభవులును దితితనూజులు
నభినవ దివ్యాంబరములు నాభరణములున్.

"కుంకుమాగురు మృగనాభి పంకములను
గంధ కర్పూరనీహార కర్దమముల
నలఁది రమరాసురులు భక్తి యతిశయిల్ల
భవుని పట్టికిఁ బసిఁడి కుంభములఁ బట్టె.

సీ. "ఉండ్రాలు నూఁటిడి పుండ్రేక్షులుం దేనె
యనఁటి పండ్లుం బూరియలు ఘృతంబుఁ
బెసరపప్పును బాలు పెరుగోగిరంబులుఁ
బాయసాన్నంబులు పానకములు
నాలికేరంపు బొండాలు మీఁగడయును
నవనీతపిండఖండములు గుడుము
లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
మండంబు చలిమిడి మండపప్పు
లాదిగా భక్ష్యచోష్యలేహ్యాదులైన
బహుపదార్థంబు లర్పించి ప్రణతులైరి
వేలుపులు రాక్షసులును నా విఘ్నపతికి
దుగ్ధపాథోధిమంథనోద్యోగ వేళ."

ఇట్లు షోడశోపచారంబులం బూజించి, దేవాసురులు విఘ్ననాయకు నిట్లని స్తుతియించిరి.

దండకము—జయజయ జగదేక రక్షామణీ! దేవచూడామణి శ్రేణి శోణ ప్రభాజాలబాలాతపస్మేర పాదారవిందా! ముకుందప్రియా! ఇందు ధారీ కటస్యంది దానాంబుధారాధునీధోరణీగాహకాతూహలాయాత మత్త ద్విరేఫాంగనాగాన సంగీతరంగీకృతస్వాంత! దంతావళాస్యా! నమస్యా! త్రిలోకైకవశ్యా! యవశ్యాయ శైలాత్మజాధర్మసంతాన! సంతాన కల్పద్రుపుష్పావతంసా! యసారోరుసంసారమాయాంధకారాపహారక్రియాభాస్కరా! కోటిభాస్వన్నిరాఘాట దేహప్రభాభాస్వరా! దేవ! హేరంబ! లంబోదరా!

యేకదంతా! మహాకాయ! సంతప్తకార్తస్వరాభా! విశాలాక్ష! మౌంజీధరా! నాగయజ్ఞోపవీతా! సమన్వీత కృష్ణాజినాయాఘువాహా! కుఠారాయుధా! విఘ్నరాజా! గణాధ్యక్ష కారుణ్య లీలా కటాక్షంబునన్ మమ్ము వీక్షించి రక్షింపుమా, క్షీరవారాశి నీ మందరక్ష్మాధరస్వామి కవ్వంబుగా నీభుజంగాధినాథుండు సూత్రంబుగాఁ గచ్ఛపాధీశుఁ డాధారపీఠంబుగా సర్వ దివ్యౌషధీవల్లుల న్వైచి నానాపదార్థంబుల న్వెన్నలం బంచుకోఁగోరి యున్నార మిక్కార్య మేవిఘ్నముం బొందకుండంగ నేవిక్రియం జెంద కిష్టార్థ సంసిద్ధులం గైకొనుంగాక నీ యాజ్ఞ సర్వేశ! సర్వాత్మకా! నిర్వికల్పా! నిరీహా! నిరాతంక! నిశ్శంక! యోంకారమూర్తీ! నమస్తే నమస్తే నమః. (6-50-58)

అని నిర్జరులును దైత్యులు
వననిధిమథనాదియందు వారణవక్త్రుం
గొనియాడి తత్ప్రసన్నతఁ
గని రొగి సంతసమునిఱు కడళ దలిర్పన్.

ఈ గ్రంథమున స్పష్టముగా షోడశోపచారంబులం బూజించి రని చెప్పుటచే ప్రస్తుతము మన మాచరించు కల్పోక్తప్రకార షోడశోపచార పూ జా వి ధి యే ప్రా చీ న కా ల ము ను ం డి యనుసరింపఁబడుచుండెనని తెలియవచ్చుచున్నది. మఱియును నివేదింపఁబడిన వస్తువులయందు మొదటనే "ఉండ్రాళ్ళ"ను పేర్కొనుటచేత శ్రీనాథుని కాలమున నీ పూజావిధానమున కెంతటి యభినివేశ ముండెడిదో మనకు వ్యక్తమగుచున్నది. వాఙ్మయమున ప్రపంచమున మఱి యెచ్చటను నీ పూజావిధానము వర్ణితము కాలేదు. ఇందలి దండకముగూడ విఘ్నేశ్వరస్తుతిపరములగు దండకములలో నాద్యమైనది, అతిప్రశస్తమైనది.

## గణచతుర్థి, లేక చవితిపూజ సంప్రదాయము

విఘ్నేశ్వరపూజ భాద్రపద శుద్ధ చవితినాఁడే చేయుట కొక కారణ మున్నది. మన దేవతలందఱు జ్యోతిస్స్వరూపులు. అనఁగా, జ్యోతిర్మండలమున నక్షత్రరూపమున ప్రకాశించుచుందురు. ఎప్పుడో సంవత్సరమున కొక్క పర్యాయము మాత్రమే మన కా స్వరూపదర్శనము కలుగును. గణపతి కూడ నట్టి నక్షత్రస్వరూపుఁడే. అతఁడు భాద్రపద శుద్ధ చతుర్థినాఁడు

సూర్యోదయమునకు పూర్వమే యుదయించును. సూర్యోదయమునకు పూర్వమేనక్షత్ర ముదయించునో ఆ నక్షత్రము నుపాసింపవలయునని వేదకాలము నాఁటి యాచారము. కాఁబట్టియే భాద్రపద శుద్ధ చవితినాఁడు మనము విఘ్నేశ్వరు నారాధించుట జరుగుచున్నది. భాద్రపద శుద్ధచతుర్థినుండి గణపతి సప్తఋషిమండలమున నుండును. ఋషుల నారాధించు ఋషిపంచమి చవితి వెనుకనే వచ్చుట కిదియే కారణము.

## ఏకవింశతిసంఖ్యా సంప్రదాయము

గణపతి పూజా సమయమున ఏకవింశతి, అనఁగా యిరువదియొక్క సంఖ్య పత్రములతో పూజలు చేయుదుము. ఇరువదియొక్క సంఖ్య ఉండ్రాళ్ళను నివేదన మొనర్తుము. ఇది గణేశమంత్ర సంప్రదాయము ననుసరించినది. గణేశమంత్రమున నక్షరములు ఇరువది యొకటి. కాఁబట్టియే, పూజా విధానమున నిరువది యొకటి సంఖ్య ప్రధానస్థానము నాక్రమించినది.

ఈ సందర్భమున 'చవితి' యను తద్భవ శబ్దముయొక్క విచారణ కొంత యవసరము. తిథుల పేళ్లయందు వరుసగా ప్రథమా, ద్వితీయా, తృతీయా, చతుర్థీ శబ్దముల కీ క్రిందివిధముగ తద్భవము లేర్పడినవి.

| | |
|---|---|
| ప్రథమ—పాడ్యమి | తృతీయ—తదియ |
| ద్వితీయ—విదియ | చతుర్థి—చవితి |

తిరిగి పంచమి నుండి దశమి వఱకును తద్భవములు లేవు. ఏకాదశికి ఏకాశి, ద్వాదశికి బారసి, త్రయోదశికి తేరసి అను తద్భవములు గలవు.

ఆ వెనుక చతుర్దశికి లేదు. పౌర్ణమికి పున్నమ యనియు, అమావాస్యకు అమవస యనియు తద్భవము లున్నవి. వీనిలో బారసి, తేరసి మున్నగునవి గ్రాంథికభాషలో నున్నవి. వ్యవహారమున లేవు. ఈ తద్భవములనుబట్టి చూడఁగా గణపతిపూజ సర్వసామాన్య ప్రజానీకమునకు సంబంధించినదని తెలియనగును. ఏలయనఁగా సామాన్య ప్రజలు సంస్కృతపదముల నెక్కువగ నుపయోగింతురు. ఇదియును నీ వ్రత ప్రాచీనతను తెలుపుచున్నది.

## గణపతి మూర్తిభేదములు

గణపతిని శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్యాది వైదికమతస్థులేకాక, వామాచార పద్ధతిని, తాంత్రిక విధానము ననుసరించిన వ్రతస్థులు కొందఱును

పూజింతురు. మఱియు నాయా మతములవారందఱును గణపతిని ప్రత్యేకము తమ తమ మతములకే చెందినవానినిగా చెప్పుకొని యుపాసింతురు. కాఁబట్టియే న్యాయములలో, అన్నింటికి ననుకూలమైన 'గణపతి న్యాయ' మను నొక న్యాయమును వెలసినది.

అష్టమూర్తి యగు శివుని పుత్రుఁడగుటచేత గణపతులును నెనిమిది భేదములు గలవారైనారు: 1. లక్ష్మీగణపతి, 2. చిక్షిప్ర గణపతి, 3. సిద్ధి గణపతి, 4. చింతామణి గణపతి, 5. శక్తి గణపతి, 6. ఉచ్ఛిష్ట గణపతి, 7. ఏకాక్షర గణపతి, 8. కుమార గణపతి అని వారి పేళ్లు. ఈ యెనమండుగురు గణపతులలోను ముగ్వురకు ఆయా నామధేయములు కలుగుటకు కారణము గణేశ్వరీయమునం దిట్లు చెప్పఁబడియున్నది.

లక్ష్మీగణపతి :—గణేశ్వరుఁడు గజాననుఁడై, అనఁగా ప్రాణరహితమైన బాలకస్కంధమున కేనుఁగు మొగము నతికిన వెంటనే గజముఖమును, మానవాకారమును దాల్చి సజీవుఁడైన సమయమున బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్వురును నాతనికి వరములొసఁగిరి. అంత తల్లియైన దాక్షాయణి స్త్రీజనసహజ ధర్మ ప్రేరితయై గజాననుని శ్రీ మహాలక్ష్మీదేవికి మ్రొక్కించెను. ఆమెయు గణపతిని వాత్సల్యాతిశయముచే నొడియం దిడికొని యీ విధముగాఁ జెప్పినది:

"తనయా! పూరుషసూక్త సద్విధులచే
తన్నిన్నుఁ బూజించిరో
ప్రణయంబారఁగ నీకథావిషయముల్
వ్రాయించిరో, వ్రాసిరో
తనివారంగఁ బఠించిరో మది నినున్
ధ్యానించిరో నీ యుపా
సనధర్మంబున నున్నవారి గృహ
మస్మద్వాస యోగ్యంబగున్."

గణపతిని పురుషసూక్త విధానమున పూజించినవారి యిండ్లలో తాను (లక్ష్మీదేవి) ఎల్లప్పుడు వాసము చేయుదునని చెప్పుటయేకాక,

"ప్రణయము సెలఁగఁగ నీ గుణ
గణ కథనము వెలయు నెడల గౌరవమతి నే
నణఁకువ నుండుట 'లక్ష్మీ
గణపతి' యను పేరు నీకుఁ గలుగుఁ గుమారా!"

అని వర మొసఁగెను. నాఁటినుండియు గణపతి లక్ష్మీగణపతి యయ్యెను.

చింతామణి గణపతి :—శ్రీకృష్ణుఁడు గణచతుర్థి నాఁడు చంద్రుని జూచిన కారణమున నపనిందబడి, దానిని తప్పించుకొను వెఱవు గానక, విఘ్నేశ్వరుని విశేషముగాఁ బ్రస్తుతించెను. వినాయకుఁడును తత్క్షణమే ప్రత్యక్షమై "నీవు వెంటనే వనమునకుఁ బోయి శమంతకమణికొఱకై ప్రయత్నింపుము. నీ కది లభ్యము కాఁగలదు" అని శ్రీ కృష్ణుని కొక యుపాయము నుపదేశించెను. కృష్ణుఁ డంతట సంతోషించి, గోవర్ధనం బెత్తునపుడు తన కింద్రుఁ డొసఁగిన చింతామణి దామమ్ము గణనాథుని కంఠసీమ నలంకరింపఁ జేసి, తత్సౌందర్యమున కచ్చెరువంది, "దేవా! నేఁడు మొదలుగా నీవు చింతామణి గణనాథుఁడు, సౌందర్య రమానాథుం డను నామములతో భక్తులచే సేవింపఁబడుచు వారి కఖిలార్థమ్ము లిచ్చుచుందువు గాక!" యని ప్రార్థించి, నమస్కరించి వీడ్కొల్పెను. నాఁటినుండి గణపతి చింతామణి గణపతి యయ్యెను.

సిద్ధిగణపతి :—భాద్రపద శుద్ధ చతుర్థి మొదలు తొమ్మిది దినములు వఱకు మహాగణాధిపతిని పూజింతురు. వీనికి 'గణపతి నవరాత్రము'లని పేరు. ప్రథమదినమగు చతుర్థియందు, వినాయకునికి విశేషామోదప్రదమగు మోదకములను (ఉండ్రాళ్లను) నివేదన మొనర్చెదరు కావున తెలుఁగు దేశమున దీనికి 'ఉండ్రాళ్లచవితి' యని పేరు. ఈ నవరాత్రములలోఁ బూజించు వినాయకునికి సిద్ధివినాయకుఁ డని పేరు. సిద్ధివినాయకుఁడే సిద్ధి గణపతి. ఈ గణపతినిగూర్చి గణేశ్వరీయమున నిట్లు చెప్పఁబడినది.

శ్రీ కృష్ణుఁడు రుక్మిణీదేవితో తనకుఁ గలిగిన నీలాపనిందనుఁగూర్చి తెలుపుచు నిట్లు చెప్పెను.

"నాకుం గార్యసిద్ధియుఁ గల్యాణసిద్ధియు నొనఁగూర్చెఁగావున వినాయకుని గణచతుర్థి నాఁడు భక్తులు సిద్ధవినాయక నామంబునఁ బూజించు వారు."

సిద్ధివినాయక శబ్దములోని సిద్ధిశబ్దమునకును, అక్షరాభ్యాసకాలము నందలి 'సిద్ధమ్ నమః' అను మంత్రములోని 'సిద్ధమ్' పదమునకును సంబంధము కలదనియు, 'సిద్ధమ్' అను శబ్దమునకు వైదిక పరిభాషలో వర్ణసమామ్నాయ మర్థమనియు, నందుచేతనే విద్యాప్రదాతగాకూడ విఘ్నేశ్వరుని నర్చింతు రనియు కొందఱు ప్రాచ్య పండితుల యభిప్రాయము.

చిక్షిప్ర గణపతి :—ఈ మూర్తి భేదమునకే హరిద్రాగణపతియని నామాంతరము. హరిద్ర మనఁగా పసుపు. ఈనాఁడు కూడ మనము విఘ్నేశ్వర పూజ ప్రారంభమున పసుపు విఘ్నేశ్వరుని చేసి పూజించిన వెనుకనే అసలుపూజ మొదలిడుదుము. చిక్షిప్ర మనఁగా వేగముగా కరగిపోవునది యని యర్థము.

కుమార గణపతి :—ఈ మూర్తికి బాలగణపతి యనియు, తరుణగణపతియనియు నామాంతరములు. ఈ రూపముతోఁగూడ కొందఱు గణపతిని బూజింతురు.

ఏకాక్షర గణపతి:—ఈ మూర్తికి చోరగణపతి యని మాఱుపేరు. గణేశ మంత్రజప సందర్భములలో జపమాలలో అక్షములను లెక్కించుటలో మోసము చేసినను, మఱచిపోయినను అక్షర మక్షరము ఒక్కొక్కటిగా లెక్కవేయుచు పట్టుకొనువాఁడు గావున ఏకాక్షర గణపతి యను పేరు వచ్చినది.

**శక్తి గణపతి**
**ఉచ్ఛిష్ట గణపతి** } :—ఈ భేదములు కేవలము శాక్త సంప్రదాయమువలన నేర్పడినవి. తాంత్రిక విధానము ననుసరించి, శక్తితోఁగూడ గణపతి నుపాసించువారి యుపాస్యదేవత శక్తి గణపతి. గణపతి సప్తమాతృకాపరివేష్టితుఁడై యుండునపుడు పంచమకార సంప్రదాయపద్ధతి ననుసరించి యీ యుపాసన జరుగును. ఈ సంప్రదాయమువారినే మహాగణపత్యుపాసకులని శంకరులు పేర్కొనిరి. శక్తిగణపతి సంప్రదాయము వ్యాప్తిలో నున్న దనుట కీనాఁడును శక్తితోకూడిన గణపతి విగ్రహ శిల్పములు వెలయుచుండుటయే నిదర్శనము. పంచమకార సంప్రదాయమున

మైథునపద్ధతిని వివరించు గ్రంథము తెలుఁగుభాషలో నున్నది. *దీనికి 'గణపతీయము' అని పేరు. ఇది యొక పద్యకృతి. శక్తిగణపత్యుపాసకులు గణాధిపతిని త్రిమూర్తులకన్న నధికునిగా భావించుటయేగాక, అతనిని పూజించిన సమస్త దేవతలను పూజించినట్లుగా తలంతురు.

## ఏఁబదియార్గురు వినాయకులు

కాశీ ఖండమున శ్రీనాథమహాకవి వినాయకుఁ డేఁబదియాఱు రూపములతో కాశీపట్టణమును సంరక్షించుచున్నట్లు తెలిపియున్నాఁడు (6-99). విఘ్నేశ్వరుఁడే డుంఠి విఘ్నేశ్వరుని నట్లొనర్పుమని యానతి యిచ్చినట్లుగా నా గ్రంథమునఁ గలదు.

"ఆవరణరూపమునఁ గాశి నహరహంబుఁ
గావఁదగు నీకు బహువిధాకారకలన
ననుచు నానతియిచ్చెఁ జంద్రార్ధమౌళి
భవుఁడు భువనాద్భుతక్రియాప్రౌఢి మెఱయ" (6-98).

అకారాదిగా, ఆ వినాయకుల పేళ్లీదిగువ నుదాహరింపుచున్నాను.

అభయవినాయక, అవిముక్త..., ఆశా..., ఉద్దండ, ఉద్దండముండ, ఏకదంత, కపిసింహ, కరిప్రియ, కర్కరీ, కాల, కాలకంఠ, కూటదండ, కూణితాక్ష, కూశ్మాండ, క్షిప్రప్రసాద, ఖర్వ, గజకర్ణ, చతుర్దంత, చింతామణి, చిత్రదంత, జ్యేష్ఠ, జ్ఞాన, డుంఠివినాయక, త్రితుండ, దక్ష, దంతముండి, దంతహస్త, ద్వాదశ, దుర్గా, ద్వితుండ, దేహళీ, ద్విపత్రిముఖ, నాగ, పంచాస్య, ప్రణవ, ప్రత్యేక, పాశపాణి, పిచిండిల, భీమచండి, మంగళ, ముండ, మిత్ర, మోదకప్రియ, యక్ష, రాజపుత్ర, లంబోదర, వక్రతుండ, వరద, వికట, విఘ్న, సర్వ, సింహతుండ, సిద్ధి, సృష్టి, స్థూలదంత, స్థూలజంఘ.

---

*మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో నీ గ్రంథము కలదు. ఇది యొక యశ్లీల గ్రంథముక్రింద పరిగణితమైనను శక్తిగణపతి సంప్రదాయమునకు సంబంధించినది. దీనిని బందరులోని శృంగారకావ్య గ్రంథమండలి వారు ముద్రించియున్నారు.

## గణపతి—శాక్తసంప్రదాయము—బౌద్ధమతము

ఈ శక్తిగణపతి సంప్రదాయము బౌద్ధమతమునందలి తాంత్రిక సంప్రదాయము ననుసరించి వ్యాప్తిలోనికి వచ్చినదని యభిజ్ఞుల యభిప్రాయము. బుద్ధుని జన్మకథావృత్తాంతమున నైరావత ప్రసక్తి కానవచ్చుచున్నది. జాతక కథలయందును గజప్రస్తావన కన్పట్టుచున్నది. బౌద్ధమత మవైదికమత మగుట చేతను, ఆ మతావతరణకాలమునాఁటికే వైదిక సంప్రదాయమున గణపతికి స్థానము గలుగుటచేతను, బౌద్ధులీ తాంత్రిక విధానమున గణపతికి తమ వాఙ్మయములో స్థానము గల్పించిరి. బుద్ధునికి, గణపతికివలెనే, వినాయకుఁడను నామము గలదు. "షడభిజ్ఞో దశబలోఽద్వయవాదీవినాయకః" అని యమరము. "సర్వాన్ వినయతి=హితమనుశాస్తీతి వినాయకః—ప్రాణులకు హితమును బోధించువాఁడు" అని వ్యుత్పత్త్యర్థములం దీయఁబడి యున్నది. గణపతి నామములను పేర్కొనుచు, "వినాయకో విఘ్నరాజ ద్వైమాతుర గణాధిపాః" అని వినాయకశబ్ద మీయఁబడియున్నది. ఇచట "1. వినయతి=శిక్షయతి దుష్టాన్ విఘ్నాంశ్చేతి వినాయకః-దుష్టులను, విఘ్నములను శిక్షించువాఁడు. (నీఙ్ ప్రాపణే) 2. విగతో నాయకః ప్రభు ర్యస్య-స్వాతంత్ర్యాత్. స్వతంత్రుఁడగుటవలన తనకు నితర ప్రభువు లేనివాఁడు" అని రెండువిధములైన వ్యుత్పత్తులును, నర్థములును నీయఁబడినవి. మొత్తముపై నీ యుత్పత్తులు బౌద్ధమతవ్యాప్తికి వెనుక తాంత్రిక విధానము ననుసరించి ప్రచారమునకు వచ్చినవే యని యూహింపఁదగియున్నది.

### గణాధిపతి జననము

గణాధిపతి జనన వృత్తాంతము తెలుఁగున రెండు విధములుగాఁ గాన వచ్చుచున్నది. ఒకటి వినాయక వ్రతకల్పము ననుసరించి పార్వతీదేవి యభ్యంజన సమయమున నలుఁగుపిండి బొమ్మను చేసి యా వెనుక గజ ముఖునిగా నావిర్భవింపఁజేసిన కథ. దానిని సంగ్రహముగా నిటఁ దెలుపుదును.

పార్వతీదేవి యొకనాఁ డభ్యంజనము జేసికొనుచు నొడలు నలుచు కొన్న పిండిచే నొక బొమ్మను జేసి, దానికి ప్రాణప్రతిష్ఠ గావించి, పుత్రునిగా భావించి, పురుషుల నెవ్వరిని రానీయకుండ భవన ద్వారమునొద్ద నా చిన్నవానిని కావలిగా నియమించెను. ఇంతలో శంకరుఁడు ద్వారమువద్దకు వచ్చి లోపలికి పోవుచుండఁగా, నా బాలుఁ డాతని 'పోవల'దని యడ్డు

పెట్టెను. శివుఁడును బాలుఁడని నయమున భయమున చెప్పిచూచెను గాని, లాభము లేకపోయెను. తన మార్గమునకు నిరోధము గల్పించుటచే నాతని త్రిశూలముచే ఖండించి లోని కేగెను. తల యెచ్చటికో యెగిరి మొండెము మాత్ర మచట నుండెను. పార్వతి సంభ్రమముతో కావలిగానున్న బాలునిఁ గూర్చి యడుగఁగా, నాతని సంహరించి లోనికి వచ్చిన సంగతిని శివుఁడెఱిం గించెను. ఆమె కోపోద్దీపితయై, బాలుని బ్రదికించినఁగాని తాను జీవింపనని పట్టుబట్టెను. శివుఁడును బ్రహ్మ నాహ్వానించెను. బ్రహ్మ ఉత్తరగ పుదిక్కున నిద్రించుచున్న మానవ శిరస్సుకొఱకు గవేషణము చేయించి, దానిని గానక యచ్చటనున్న యొక మాతంగముయొక్క శిరస్సును ఖండించి, దాని నా బాలుని మానవశరీరమున కతికెను. అప్పు డాతఁడు పునర్జీవితుఁడై గజా ననుఁ డయ్యెను. పార్వతీ పరమేశ్వరు లానందభరితులై, తమ పుత్రునిగా స్వీకరించి, యాతనికి సకల విద్యాధిపత్యము, శుభకార్యములం దగ్రపూజ, విఘ్నేశ్వరత్వము, చిరంజీవిత్వము మొదలగు వరముల ననుగ్రహించిరి. భాద్ర పద శుద్ధ చవితినాఁడు గజాననుఁడు పునర్జీవితుఁడైన కారణమున నా దిన మున జనులు పూజించుట నియతమైనది. ఈ కథ సర్వేసర్వత్ర వాడుకలో నున్నది. ఆబాలగోపాల మెఱిఁగినది. కాని యాంధ్ర వాఙ్మయమును పరిశీలించి నచో నీ కథ పందొమ్మిదవ శతాబ్దివఱకును ప్రబంధ రూపమున వెలువడలేదు.

రెండవది —పార్వతీ పరమేశ్వరులు గజరూపములతో క్రీడింపఁగా, గజాననుఁడు జన్మించుట. ఇది నవీన వైజ్ఞానికదృష్టిలో శాస్త్రీయముగఁ గన్పట్టును. ఈ కథను తొలుతఁ దెలిపినవాఁడు కవిరాజశిఖామణి నన్నె చోడదేవుఁడు. అతని గ్రంథము ప్రథమాంధ్ర ప్రబంధము కుమారసంభవము అందు ప్రథమాశ్వాసమున నీ వృత్తాంతమున్నది.

ఆదిమూర్తులును, శివశక్తులును నగు సతీదేవియు, పరమేశ్వరుఁడును రజతనగపార్శ్వముల విహారము చేయుచుండిరి. ఆ సమయమున నచటికి కరి కరేణువు లసంఖ్యాకముగా వచ్చి, విహరింపఁదొడఁగినవి. ఇంతలో సూర్యుని కాంతి తీక్ష్ణమగుటచేత, నచ్చట నున్న కొలనిలోనికి నామ స్త్రీభయముగ ములు వెడలి జలక్రీడ లాడఁజొచ్చినవి. అట్టి పట్టున,

మ. "హృదయాహ్లాదముతోడఁ బాయక సదా
నైక ప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్
'మత్తేభ విక్రీడితం'
బది దాక్షాయణి చూచి, కౌతుకరసై
కాలీన భావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ నెఱపె
నీశానాననాబ్జంబుపైన్."*

ఆ సమయమున పరమేశ్వరుండు నిజకీపితేశ్వరి కన్నెఱింగి దానికి సమ్మతించినం గని సంతోషించి,

క. సతి గరిణి యగుడుఁ ద్రిజగ
త్పతి గరియై కూడె, "సతులు భావించినయా
కృతిఁ గూడ నేర్పఁగాదే
యతిశయముగ నింగితజ్ఞులకు ఫల మొందున్."

అని కవి సతీపరమేశ్వర గజరూప సమాగమమును సమర్థించినాఁడు. అప్పుడు,

---

* ఈ పద్యము మత్తేభక్రీడాసమయమున మత్తేభవిక్రీడిత మను వృత్తముగా వెలసినది. ఇది యెంతయు సముచితమై కవియొక్క వృత్తౌచిత్యమును వెల్లడించును. మఱియును వృత్తముపే రావృత్తమునం దనుసంధించుట నన్నిచోడుని కవితా చమత్కారములలో నొకటి. అదియును సందర్భశుద్ధిగలిగి రసోత్తరముగా నున్నది. ఇది యొక యలంకారముగాఁ బరిణమించినది. దానికి 'ముద్రాలంకారము' అని పేరు. ఈ పద్ధతి వాఙ్మయములో ప్రవేశపెట్టిన కవి నన్నిచోడ కవిరాజు. ఈ విషయమును తొలుత లోకమున కెఱిఁగించిన దీ పీఠికాకర్తయే. (1939)

క. "పురుషాకారముఁ బటుమద
కరివదనముఁ గుబ్జపాదకరములు లంబో
దరము హరినీలవర్ణముఁ
గర మొప్పఁగఁ దాల్చి విఘ్నవరుఁడుదయించెన్."

అంత హరిపరమేష్ఠిపురందరాదు లనుపంచి ప్రార్థింప శివుఁడు గజాననునకు * శివగణసురగణాది సమస్త గణాధిపత్యాఖిలక్రియారంభాధిపత్యంబులతో యువరాజ పట్టంబు గట్టెను. దేవతలందఱు సంతసించిరి.

కాని పై పిండిబొమ్మ వృత్తాంతముకూడ నన్నెచోడుని కాలమున వ్యాప్తిలో నున్నట్లు కుమారసంభవమునుండియే తెలియుచున్నది. తారకాసుర సంగ్రామఘట్టములో, నేకాదశాశ్వాసమున (179 ప.) నొకపట్టున నిట్లున్నది.

"ఉరుతరతనుఁడగు సద్భట
వరునట్టనిభంబు శిరము వడి నదికి బలో
త్కారమునఁ బ్రతివీరభయం
కరుఁడై యుద్ధంబు చేసె గణపతి వోలెన్."

---

*కథానుకూలముగా, కావ్యౌచిత్యముకొఱకు, మొదట నీ గజరూప సమాగమము నట్లు సమర్థించియు, నా వెనువెంటనే నన్నెచోడమహాకవి యీ ఘట్టమున నెట్టి లోకోత్తరమైన సత్యము నర్థాంతరన్యాస మూలమునఁ జెప్పినాఁడో చూడుఁడు.

"తే. ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు
హరుఁడు సతి తాను సురతార్థులై విహీన
తరములగు మృగరూపముల్ దాల్చి రనిన
కాము మాయల నెవ్వారు నేమిగారు!"

ఎట్టి శృంగార ఘట్టము లున్నను నిట్టి ప్రబోధము లచ్చటచ్చట నెదకు నచ్చొత్తునట్లు మన ప్రాచీన ప్రబంధములందు గలవు.

తరువాతి కాలమున వెలసిన ప్రబంధములకును, పూర్వ ప్రబంధములకును గల వ్యత్యాస మీ దృష్టిభేదమేయని గ్రహింపనగును.

"యుద్ధము చేయుచుండఁగా నొక స్థూలతనుఁడగు భటుఁడు శిరస్సును గోల్పోయెను. అప్పుడు వేఱొక భటుఁడు, అచ్చట పడియున్న యొక యేనుఁగుతల నా మొండెమున కదుకఁగా అతఁడు గణపతివలె యుద్ధము చేసెను." అని పై పద్యముయొక్క తాత్పర్యము. మొండెమునకు నేనుఁగు తల యతికిన వృత్తాంతము గజాననుని తొలుత పిండిబొమ్మగా చేసినకథయందే కలదు. దీనిఁబట్టి పిండిబొమ్మవృత్తాంతము నన్నెచోడుని నాఁటికి ప్రచారములో నున్నదని తెలియఁగలదు. ఈ 'పిండిబొమ్మ' వృత్తాంతము శివపురాణము గణేశఖండములో నున్నది. కాఁబట్టియే నన్నెచోడుఁడు దీనిని తన కావ్యమున సూచించియున్నాఁడు.*

నన్నెచోడకవి ననుసరించి నిశ్శంకకొమ్మన యను కవి 'శివలీలా విలాసము' అను తన కావ్యమున, గణాధిపతి సతీదేవికి, నీశ్వరునకు గజరూప క్రీడవలన జన్మించినాఁడని వ్రాసియున్నాఁడు. శివలీలా విలాసమున **

---

*ఈ సందర్భమున మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితమైన కుమార సంభవమున గ్రంథాంతమున వివరణలలో నిట్లున్నది (పుట 61) "కాని గణాధీశ్వరు జననముమాత్ర మీరీతిగా లేదు. దీనినిమాత్ర మీతఁడు దక్షిణదేశీయ గాథలనుండి గ్రహించి రచించియుండును. పురాణములలో దేనియందును దీని కాకరము కనఁబడదు. ఆగమములందు కల దందురుగాని వాని ప్రాచీనత యెట్టిదో నిర్ణయింప శక్యముకాదు. కాని యీ కథ ప్రాచీన తమిళ గ్రంథములం దుండుటచేత దేశీయ మనుటకు సందేహము లేదు" అని వ్రాయఁబడియున్నది. ఆగమముల కాలనిర్ణయము చేయ వలనుకానప్పుడు తమిళగ్రంథ ప్రాచీనత నిర్ణయింపవలెనుగదా! మఱియు నన్నెచోడుఁడే గ్రంథమున దేశీయమగు పిండిబొమ్మ వృత్తాంతమును సూచించుచున్నప్పుడు, గ్రంథ సంపాదకు లావిషయమును విస్మరించి, గణనాథ జన్మ వృత్తాంతము దేశీయముగా మార్పుచేయఁబడిన దని వ్రాయుట యసంగతము. ఈ గ్రంథము ననుసరించి తక్కిన విమర్శకులును గ్రంథము పూర్తిగా చదివి యర్థమును గ్రహింపకే, గజరూప క్రీడా వృత్తాంతము నిద్దఱు కవులు వ్రాయఁగా నన్నెచోడకవి యొక్కఁడే వ్రాసినాఁడని తలంచుట మఱియు నసంగతముగా నున్నది.

**'శివలీలా విలాసము' పూర్తిగ లభింపలేదు. అవతారికతో మూఁడాశ్వాసములు లభించినవి. లభ్యమైన భాగము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటితమైనది.

ప్రతిపాదింపఁబడినవి శివుని ముప్పదియాఱు లీలలు. ఆ లీలలలో నిది యైదవది. అందుండి ముఖ్యభాగము నుదాహరించుచున్నాను.

"రజతనగపార్శ్వమున... పెక్కు తెఱంగులం గలుగు విహారణంబులం దగిలి మెలంగు పమ్మిథునంబులం జూచి శంకరుఁడు సతీవదనంబు సంస్పృహంబుగా నిరీక్షించిన సమయంబున—

"సతి గాంచెన్ పరిశుద్ధవర్ణ కనక
చ్ఛాయాచ్ఛటా భాసురో
ద్గతపాశాంకుశమోదకాభయ
సమగ్ర శ్రీ సముల్లాస స
న్నుత దంతాగ్గళ శోభమానఘన
శుండాలాక్షుణీయున్నగో
న్నతకాయున్ జగదేకరక్షణ మహా
త్ప్రారంభు హేరంబునిన్."

అప్పుడు—

"ప్రాచీముఖ్యదిశల్ ప్రసన్నతర
శోభ న్మించెనవ్యార్భులన్
శోచిష్కేశుఁడు ప్రజ్వలించె పృష
దశ్వం డుద్యతావిత్ ప్రభా
వైచిత్రిం బ్రసరించె నెంతయు వివస్వ
న్మండలంబెల్ల స్వ
ర్లోచిర్లక్ష్మి వహించె నీశ్వరికిఁ
బుత్రుం డంత జన్మించినన్."

ఇట్లే పచ్చకప్పురపు తిరువెంగళకవి యనునతఁడు తన 'చొక్కనాథ చరిత్ర'మను ద్విపదకృతియందును గజాననోద్భవమును వర్ణించియున్నాఁడు. చొక్కనాథుఁ డనఁగా దక్షిణ మధురలోనున్న సుందరేశ్వరుఁడు. అతని లీల లఱువదినాలుఁగు. దీని ననుసరించి ద్రవిడదేశమున తేవారములలో గణనాథుని జన్మవృత్తాంతము చెప్పఁబడియున్నది. కాని ద్రవిడ తేవారముల కన్న ముందుగా వెలసిన ఆగమ గ్రంథములలో నీ కథ కానవచ్చుచున్నది.

శివాగమములలో ప్రసిద్ధమగు సుప్రభేదాగమమున నిట్లున్నది.

"అథాత స్సంప్రవక్ష్యామి విఘ్నేశస్థాపనం పరమ్,
ఆదౌత్వహ ముమాసార్థం క్రీడార్థం హేమవద్వనే
కరేణుశ్చ గజేంద్రేణ సంభోగ మకరో త్తతః
యదృచ్ఛయాతు తం దృష్ట్వా తదాకార మశామహమ్
కరేణో రాకృతిం చోమా తదాక్రీడమహాంభృశమ్
తస్యాంతు గర్భమదధా త్తస్మిన్ కాలే తతోద్భవః
ఫలం దక్షిణహస్తేన వామహస్తే స్వశృంగకమ్
పాశాంకుశోర్ధ్వహస్తేతు గజహస్తేతులష్టకమ్.
కరండమకుటం ప్రోక్తం సర్వాభరణభూషితమ్
శిరశ్చక్రప్రభాం కృత్వా నర్మపీఠోపరిస్థితమ్
దాడిమీపుష్పసంకాశం సర్వాభరణభూషితమ్
ఆసనం స్థానకంవాపి కారయే ద్విఘ్ననాయకమ్."

(సుప్రభేదాగమము—త్రిచత్వారింశత్తమ పటలము).

నన్నెచోడ మహాకవి రచనకు పైనుదాహరించిన భాగము బీజము కానోపును. సుప్రభేదాగమములోని విషయమును గ్రహించి కథను పెంపుచేసినట్లు కనఁబడుచున్నది. అందు హేమవద్గిరి యని యుండ నన్నెచోడఁడు రజతపర్వతమని చెప్పియున్నాఁడు. మరియు మూలమున శివుఁడు విఘ్నేశ్వరునితో నాతని జననవృత్తాంతము చెప్పినట్లున్నది. ఇది యంత యుచితముగ లేదని కాఁబోలు నన్నెచోడకవి పార్వతీ పరమేశ్వరులు గజరూపము

లతో క్రీడించిరను విషయము మాత్రమే కైకొని విఘ్నేశ్వరుఁ డుదయించెనని చెప్పినాఁడు. ఇట్లే సరసములును, మనోహరములును నగు మార్పులు నన్నె చోడకవి తన కావ్యమునం దెన్నియేని కావించియున్నాఁడు.

గణాధిపతి జననమునకు సంబంధించిన పై కథ కుమారోత్పత్తికి ముందుగ నిందు చెప్పఁబడియున్నది. ఇది సమంజసమే. గణాధిపతి ఆదిమ దంపతులగు సతీశంకరులకు ప్రథమపుత్రుఁడు. కాఁబట్టియే నన్నెచోడకవి జ్యేష్ఠుని వృత్తాంతము తొలుత చెప్పి, యా వెనుక ద్వితీయుఁడును, అద్వితీయుండును నగు కుమారస్వామి జననము వర్ణించి యున్నాఁడు.

సరసమైనను, శాస్త్రీయమైనను, ప్రజాసామాన్యములో గజరూప క్రీడా వృత్తాంతము వ్యాప్తము కాలేదు. పిండిబొమ్మ వృత్తాంతమే హెచ్చుగా ప్రజల నాకర్షించినది * కాని యది కావ్యగౌరవము పందొమ్మిదవ శతాబ్దివఱకు పడయలేదని చెప్పవచ్చును. ఆ శతాబ్ది ప్రథమ దశకము నుండి నందూరి బాపయామంత్రి 'విఘ్నేశ్వర చరిత్రము', వారణాసి వేంకట రాయకవి 'గణనాథాభ్యుదయము', నాగవరపు రామచంద్రకవి 'గణపత్యుద్భవోపాఖ్యానము' మున్నగు ప్రబంధములు వెలసినవి. వీనిలో బాపయామంత్రి కృతి ప్రౌఢమైనది. ఈ యిరువదవ శతాబ్దిలోకూడ పై కథా వస్తువునే గ్రహించి యీ గణేశ్వరీయము రచితమైనది. ఇందు కవి ప్రత్యేకముగ ప్రదర్శించిన గుణ విశిష్టతలను తెలుపుచున్నాను.

1 భక్తిపరత్వము :—మూర్తిత్రయము, శక్తిత్రయము మున్నగు రూపములు బ్రహ్మముయొక్క వ్యక్తాకారములనియు, వారివారిని వర్ణించు పట్టుల, పాక్షికబుద్ధి భక్తు లనువారికి కలుగరాదనియు గ్రంథకర్త ముఖ్యాభిప్రాయము. ఒక్కొక్క సందర్భమున నొక్కొక్కరి కాధిక్యము కల్పించి

---

* ఈ ఘట్టమున గణపతి పార్వతీ పరమేశ్వరుల పుత్రుఁడు. ఇదియే తెలుఁగుదేశమున చిరకాలమునుండి వ్యాప్తిలో నున్నట్లు "ఈశ్వరాపుత్రునకు గాజావతారునకు పార్వతీ తనయునకు భక్తితోఁడా" అను స్త్రీల పాటవలన తెలియుచున్నది. గజాననోదంతము వేఱువేఱు కల్పముల వేర్వేఱు కథనులుగా చెప్పఁబడినదని శివపురాణము చెప్పుచున్నది. శ్వేతకల్పమున పిండిబొమ్మ వృత్తాంత మున్నదని శివపురాణము చెప్పుచున్నది.

వారివారిచే వారివారిని వినుతింపఁజేసి తన సర్వదేవతా సమత్వబుద్ధిని కవి ప్రదర్శింపఁజేసి యున్నాఁడు.

1. ద్వితీయ శీర్షికయందు పార్వతీదేవిచే బ్రహ్మను ప్రశంసింపఁజేయుట.

2. అంటే పార్వతి ఈశ్వరుని ప్రార్థించుట.
3. అంటే బ్రహ్మ ఈశ్వరుని పొగడుట.
4. శివుఁడు విష్ణువును స్తుతించుట.
5. కైలాసమున గణపతి స్తోత్రము.
6. బ్రహ్మయొక్క శక్తిస్తోత్రము.
7. జాంబవంతుఁడు శ్రీ కృష్ణుని స్తుతించుట.

2. తాత్త్వికదృష్టి:—ఏ సందర్భమునందైన, ఆధ్యాత్మికమైన దృష్టియే కాని వేఱొకటి లేదు. పార్వతీదేవిస్తుతిలో—

"నానాసృష్టి విచిత్రవస్తువులలోనం
బంచభూతమ్ములన్
జ్ఞానాక్షమ్ములఁ దోఁచి భక్తులకు
నజ్ఞానాంధకారంబు నెం
తేనిన్ మాపుచు సర్వదా సులభుఁడై
యేపారు యోగీశ్వర
ధ్యానాంతర్గతమూర్తిఁ గొల్చెదను
పుత్రత్రాణ వాంఛారతిన్."

"జగత్సృష్టి ప్రధానోచితాధారవ్యక్తివి నీకు నెయ్యెడ నసాధ్యంబుండునే" అని చెప్పించి యామె మాతృకాశక్తిని వ్యక్తము చేసియున్నాఁడు. రాజదృష్టి దోషముచే గణేశుఁడు మూర్ఛలో మునిఁగినపుడు, పార్వతీదేవి రౌద్రమూర్తియై చంద్రునికి శాపమిచ్చు ఘట్టమున కవి మధ్యాహ్నార్క సహస్ర రూప సన్నిభమగు శ్రీమద్రాజరాజేశ్వరీ దేవి దివ్యస్వరూపముగా వర్ణించి యున్నాఁడు. ఆ రౌద్రమూర్తి కోపము నుపసంహరింపఁజేయుటకు త్రిమూర్తులు, దిక్పాలకులు, దేవతలు, మునులు మొదలగువారందఱును సరుదెంచి,

యామెను స్తుతించిరి. అందు బ్రహ్మస్తుతి దేవీమహామహిమను సహస్రముఖములుగా వ్యక్తీకరించుచున్నది.

శా. "ప్రాణాయామపరాయణుల్...

శా. తుష్టాంతకరణ...

సీ. పద్మాలయా.

తతమణిద్వీప బిల్వకాంతారమధ్య మణిమయాసనమున నుండి మందహాసరుచుల పదునాల్గు లోకముల్ రూఢినేలు దేవి" అని ప్రార్థించినాఁడు.

ఇచట గ్రంథకర్త షట్సంఖ్య గల పద్యములును మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, సహస్రార, బ్రహ్మరంధ్రము లనియెడి షట్చక్రములను సూచించునని యెఱుంగఁదగును.

పార్వతి పుత్రుని రక్షణకొఱకు పరమేశ్వరుని ప్రార్థించు ఘట్టమున కవి శివపారమ్యమును స్పష్టపఱచియున్నాఁడు. తన కధీశ్వరుఁడే యైనను, శివుఁడు సమస్త లోకములకు నధీశ్వరుఁడే యనియు, సకల కార్య కారణ క్రియారూపకవ్యవస్థ, నిగ్రహానుగ్రహము లా పరమశివ తత్త్వమునందే ఇమిడి యున్నవనియు, భక్తిగమ్యుఁడగు ఆ పరమేశ్వరుని పవిత్ర హృదయముతో నుపాసించిన నభీష్టములు బడయవచ్చుననియు పార్వతీదేవి స్తోత్రమూలమున మన కెఱుకపఱచినది.

3. కావ్యమున కథావస్తువు దేవతాశోభితమైనది. జగదాదిమ దంపతులైన పార్వతీ పరమేశ్వరుల ప్రథమపుత్ర జననమును ప్రపంచించునది. కథా సన్నివేశములు జరిగినది సాంబశివ నివాసమగు రజతాచలము. బ్రహ్మేంద్రాది దేవతలును, నారదాది మహర్షులును మనకు నెడనెడ దర్శన మొసఁగుదురు. కావ్య వాతావరణ మంతయు దివ్యత్వ సౌరభ సంవాసితము. అయినను, గ్రంథకర్త తన యసమాన నైపుణ్యముచే నీ కథకు లౌకికవ్యాపార స్ఫురణ కల్గించి రసోచితము గావించియున్నాఁడు. పార్వతీదేవి తలయంటుకొనుటకుఁ బూర్వము నలుగుఁబిండి నొక బాలకరూపముగా నొనరించి, ప్రాణప్రతిష్ఠకొఱకు బ్రహ్మదేవుని యొద్దకు వెళ్లుట, ఆ బాలుని లోని కెవ్వరు రాకుండ ద్వారమునొద్ద కావలియుంచుట—ఇవి యన్నియు నిత్యమును జరుగు లోకసామాన్యవృత్తములు. పార్వతిని జూచుటకు శివుని యుత్కంఠ, ప్రేయసీ వీక్షణాయత్తచిత్తులగువా రెట్టి యడ్డంకులను లక్ష్యపెట్టరని తెలుపుటకు కావలిగా నున్న బాలుని కంఠము నీశ్వరుఁడు ఖండించుట, పార్వతి

నిలాపము, ఆమె మాతృప్రేమ, తిరిగి బాలుని బ్రతికించుటకు పట్టిన పట్టు- ఇట్టి ఘట్టములన్నియు నిసర్గ మానవస్వభావమనోభావ నిరూపణములు. ఇట్లు లౌకికభావదృష్టితో కావ్యావలోకము నొనరించునపుడు మానవత్వము' మనోభావదృష్టితో నాలోకనము చేసిన దివ్యత్వము మన కడుగడుగునకును ప్రత్యక్షమగుచునే యుండును. ఇట్లే కావ్యసృష్టి ద్వైతముగా భాసించు చున్నను, నేకైకమగు సద్వైత తత్త్వమును గణేశ్వర భక్తితత్త్వ ప్రబోధముచే సద్వైతానందదాయక మగుచున్నది. ఈ రసానుభూతియే యిందలి కవితాశక్తికి కీలకము.

జగదాదిమదంపతుల లౌకిక వృత్తముతోపాటు సాక్షాజ్జగజ్జనని యగు శ్రీమదాదిశక్తి యఖండ చిన్మయతత్త్వ మిందు గర్భీకృతమై యున్నది.

గణేశ్వరీయమున కవితారచన గణనీయమైనదే కాక రమణీయమైనది. కమనీయమైననేకాక కల్యాణాత్మకమైనది. రమణీయమే కాక రసాలంకృతమైనది. మాననీయమే కాక మనోహరమైనది. కవితాధార గంగాప్రవాహ సదృశమైనది. బాల్యమునుండి పూర్వజన్మ సంస్కారవశమున నప్రయత్నముగ నలవడిన కవిత్వమునకు గ్రంథకర్త ప్రాచీనాంధ్రమహాకవుల కవన వనమునందలి కావ్యరసాల మరందమును గ్రోలి, పుష్టిని, తుష్టిని చేకూర్చినాడు. కావ్యమందంతటను పూర్వాంధ్రకవుల యనుసరణములు గన్పట్టు చున్నను, కని స్వతంత్ర రచనాశక్తి సర్వత్ర సంపూర్ణముగ భాసించు చునే యున్నది. ఆ ప్రాక్తన కవీంద్రులలోను, శిష్టయోగవిద్యాసంపన్నుండగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవియు, పరమ భాగవతోత్తముండై, ఆంధ్ర లోకమును భక్తిరసపారావారమున నోలలాడించిన బమ్మెరపోతన మహాకవియు నీతనిని చాలగా నాకర్షించినారు. మన గ్రంథకర్త పోతన కవితామృతమును తనివితీరఁ గ్రోలి జీర్ణించుకొన్నాఁడు. ఆతని అనుప్రాసాది విన్యాసము లచ్చుగ్రుద్దినట్లుగా నీ కావ్యమున నందము నందినవి.* అట్లని తక్కిన మహాకవుల రచనలను మన కవి చవిగొనక విడువ లేదు. చవిగొనినవానిని చక్కఁగ ననుసరింపక పోలేదు. ఈ క్రింది సంవాదములను తిలకింపుఁడు.

---

*భక్తి భావనచేత నేగాక పరమేశ్వరునికి కృతినొసంగుటయందును, సహజ పాండిత్యముచేత నేగాక, సర్వదేవతా సమబుద్ధియందును మన కవి పోతన ననుసరించియున్నాఁడు.

పినవీరభద్రుఁడు (జైమినీ భారతము) :—

సీ. "అలసతఁ జూపు నొయ్యారంపు నడపులు
వనమయూరముల గర్వము గుదింప
సఖులు వేమఱు బిల్చు సరసంపు బలుఁగులు
మత్తకోకిలముల, మనసుఁ గలఁప
నిటలంబుల నటించు కుటిలాలకంబులు
షట్పదంబుల విలాసముల గెలువ
తరళలోచనముల ధాళధళ్యంబులు
హరిణుల సౌభాగ్య మవఘళింప

గీ. దండడించు మనోరథోద్ధతి విహార
సరణిఁ జంపకమాలినీ తరుణిఁ గూడి
మానినులు గోసి రవ్వనమంజరులను
సరసి సరసిజముల పెక్కు చందములను." (8-73)

పై సీసపద్యమున, పుష్పాపచయ సందర్భమున పెక్కు చందములు (చందములు—రీతులు, చందములు—ఛందస్సులు) గల వృత్తముల పేళ్లన్నియు సరసముగా సంతరింపఁబడినవి. మన కవియు పై ప్రాచీన పద్యమునకు మెఱుఁగుఁబెట్టినట్లు, ఛందోమయ దేవతయగు శారదాదేవి స్తుతి సందర్భమున నిట్టి రచనము నెంత రసవత్తరముగా వ్రాసినాఁడో గమనింపుఁడు:—

సీ. "కందంబులను బోని కచభారమునఁ జంప
కోత్పలంబులు ముద్దులొలుకుచుండ
మత్తకోకిలము లాత్మస్వనంబుల కుల్క
మానిశార్దూలముల్ మనవిఁ దెల్ప

పంచచామరములు పడఁతులు వీవంగ
మత్తేభములు పుష్పమాల నీయ
చెలఁగి స్రగ్ధర లాటవెలఁదులు నటియింప
తేటగీతంబులు దీటుకొనఁగ

సీ. సమయవిస్ఫూర్తి నెసఁగు వృత్తములు నియత
శాస్త్రసరణిని గన్పట్ట సకల భూష
ణములు ఘలుఘల్లురని మ్రోవ నాట్యమాడు
మమ్మ! శారద! నాజిహ్వాయందు నీవు."

(అవతారిక)*

మహా భాగవతము మన కవికి పారాయణగ్రంథము. అందుచే నందలి పదములు, సమాసములు, భావములు అప్రయత్నముగా గణేశ్వరీయమును నలంకరించినవి.

భాగవతము—అష్టమస్కంధము :—

ఆ. వె. "కాలు గెల్వవచ్చు కామారి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
ఆఁడువారి చూపుటంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన."

ఇది యాటవెలఁదిలో నుండుట విశేషము.

గణేశ్వరీయమున పై పద్యమునకు వ్యాఖ్యానరూపముగా—

శా. "కాలుం గెల్వఁగవచ్చు నొక్కొకయెడం
గామారి గావచ్చు ని
ర్మూలింపంగను వచ్చు మృత్యువు
పురంబుల్ గాల్పఁగా వచ్చు; ధా

* ఈ ముద్రణమున ముద్రితము కాలేదు.

రాళజ్ఞానమయత్వ సంపదను
సర్వజ్ఞుండుఁ గావచ్చు కాం
తాలోలాత్ముఁడె యైన నీశ్వరున
కైనన్ నిల్వఁగా శక్యమే?

గీ. "మారునిం గెల్వఁగావచ్చు మైవిభూతి
నలమికొని వచ్చు నుగ్రుఁడై మెలఁగవచ్చుఁ
గాని యామూఁడు కన్నులవానికైనఁ
దనయుఁ డగుపడ మోహంబు దాఁటరాదు."

భాగవతము—అష్టమస్కంధము :—

"ఆకర్ణి కాంతర ధమ్మిల్లము చక్కనొత్తఁడు"

గణేశ్వరీయము :—

"ఆకర్ణి కాంతర జటాభారంబు చక్కదిద్దుకొనక."

మనుచరిత్ర :—

"శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాకెం బత్తులు."

గణే :—

"పాకెం బత్తులు బారుబారులుగ సంభ్రమ్మందు."

మను:—ఆయతిమై నిలు దీర్ప.

గణే:—ఆయతిమై నిలు దీర్ప.

శ్రీనాథుఁడు—హారవిలాసము :—

"మాటలు వేయు నేమిటికి మంగళ లక్షణ లక్ష్మి"

గణే:—"మాటలు వేయు నేమిటికి మర్త్యనిలింప భుజంగ యోవనుల్."

శ్రీనాథుఁడు—భీమఖండము :—

"దక్షారామపురాధినాథుని సుధాధామార్ధ చూడామణిన్." (4–100,

గణే:—"దక్షానల్ప కృపాంతరంగుని సుధాధామార్ధ చూడామణిన్."

తిక్కన :—"భద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము."

(విరాట 1–1)

గణే: —"భద్రాయితమూర్తియై యభవధన్యత."

ఈ గ్రంథమున మున్ను చూపిన తెలుఁగుకవుల పోకడలే కాక సంస్కృత కవితాచ్ఛాయలును గానవచ్చుచున్నవి. చూడుఁ డీక్రింది యనుసరణము.

సీ. "తాను చర్మంబులఁ దాల్చియు భక్తులఁ
గనకచేలమ్ములఁ గట్టఁజేయు
తాను కొండలలోనఁ దగ వసించియును సం
శ్రితుల సౌధముల వసింపఁజేయు
తాను గపాలముల్ ధరియించియును శ్రిత
గళముల మణిహారములను గూర్చు
తాను భిక్షుకుఁడయ్యుఁ దన్నుపాసించిన
వారికి సకల సంపదల నొసఁగు

తే. అట్టి భక్తపరాయణు నాదిమధ్య
నిరయరహితుఁ బరాత్పరు హరు నగాత్మ
జామనోహరు నిరతప్రసన్నరూప
ధరు నుపాసింతు మమ్ము సంతతము ప్రోవ."

(అవతారిక)

ఇది కాళిదాసరచిత మాళవికాగ్నిమిత్ర నాటకమునందలి నాందీ శ్లోకమునకు ఛాయానువాదము.

"ఏకై శ్వర్యస్థితోపి ప్రణత బహుఫలే
యస్స్వయంకృత్తివాసా
కాంతాసమ్మిశ్రదేహోప్యవిషయమనసా
యః పరస్తా ద్యతీనామ్
అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి
ర్బిభ్రతోనాభిమానం
సన్మార్గాలోకనాయ వ్యపనయతు సవ
స్తామసీవృత్తి మీశః."

ఇట్టి వింకను గలవు. గ్రంథ విస్తర భీతిని విరమించితి?

## కవిచరిత్రము

ఉత్తరాంధ్రసీమయగు కళింగదేశమున పూర్వ గంజాము మండలమున (నేఁటి శ్రీకాకుళము) ఘనత కెక్కిన బ్రాహ్మణ కుటుంబములలో "కన్నేపల్లి" వారి వంశ మెన్నఁదగియున్నది. వీరు తులలేని, వెలలేని వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రులు. గౌతమసగోత్రులు. ఈ వంశ ముక్తామణులందఱును నిగమాగమ శాస్త్ర విద్యాపారీణులు, నిగ్రహానుగ్రహ సమర్థులు, నిరవద్యదానశీలురు, నిష్కళంక ప్రతిభులు. వీరిలో కామాంబా లక్ష్మీనరసయ్య భుక్త దంపతులకు జన్మించిన రెండవ కుమారుఁడు మన గ్రంథకర్త సాంబశివ రఘురామస్వామి. ఈయన జననము విరోధి సంవత్సర ఫాల్గుణ బహుళ చతుర్దశి (19-3-1890). కమలా సరస్వతీ నిలయమైన కన్నేపల్లి వంశమున జన్మించిన మన గ్రంథకర్తకు ఆశుకవిత చిన్ననాటనే యలవడినది. మాలికా కవిత్వము చెప్పుట యాతనికి మంచినీళ్ళప్రాయము. అంతియే కాక యష్టావధాన చాతుర్యము గలిగిన మేధావి. చిన్ననాఁట రచించిన దాదాభాయి నౌరోజీ నవరత్నములు, బాలసుధాంశురేఖ, దేవవ్రతీయము, స్త్రీ సాహసము, స్నేహలతా నిర్యాణము మొదలగు కృతులు నేఁడలభ్యములు. ఈ గణేశ్వరీయమునకు ముందు రచించిన వాగ్దేవత, లేక జాతీయాదర్శము అను గ్రంథము నేఁడలభ్యము. అందుండి కొన్ని పద్యములు లభించినవి. దానినిబట్టి చూడఁగా నీ గ్రంథ రచయిత యెంత గాఢమైన దేశాభిమానము గలవాఁడో తెలియనగును. మచ్చునకు :—

"జనవంద్యాగ్రణులన్ మహామహుల
వాక్సంపన్నులన్ రామమో
హన విద్యానిధి చంద్రసేనుల
వివేకానంద గోపాల కృ
ష్ణనయజ్ఞానులఁ గన్న మా
భరతవర్ష మ్మింక స్వాతంత్ర్యమున్
గన సన్నద్ధము కాదు కాదనినచో
న్యాయమ్మె వాగ్దేవతా."

---

* గ్రంథ విస్తరభీతిచే నా మాలికల నిం దుదాహరింపలేదు.

ప్రస్తుతము లభ్యమగుచున్న కృతులలో నక్షత్రమాల యొకటి. "ప్రియ వినయశీలి మైలాపురీ కపాలి" అను మకుటముతో చెన్నపురినున్న మైలాపురి కపాలీశ్వరునిపై చెప్పఁబడిన సీసపద్యకృతి యది. ఇందలి శైలి రసోత్తరమైనది.

"చూతమ్ముఁ గని చవిచూతమా యన్న న
 క్కొమ్మపై నొక పండుకోఁతి యుండు
మలయవాయువు గ్రోల మలయుదుమా యన్న
 చెంతనే యొక కొండచిలువ యుండు
కేతకీకుసుమసంకేతము గనఁబోవ
 మిలమిల యని పాము మెసలుచుండు
సరసత గలవారి సరసఁ జేరెదమన్న
 కొండికాఁ డొకఁడు నాదండ నుండు

గీ. రాజసభఁ జేరి కీరితి రాజిలంగఁ
బ్రియపడిన దుష్టుఁడట దాపరించియుండు
మంచియును జెడ్డ యీరీతి మసలుచుండుఁ
బ్రియవినయశీలి మైలాపురీకపాలి."

వీరు శ్రీమద్విజయనగర సంస్థాన మహారాజ సమ్మానితులై, చెన్నపురిని తత్సంస్థాన ప్రతినిధులై, మహారాజ, మహారాజ్ఞీ మహాంతరంగిక కార్యదర్శులై, మూఁడు దశాబ్దులకుపైఁగ తత్సంస్థానమునకు సేవ యొనర్చి నేఁడుపకారవేతనము నందుచున్నారు.

పుట్టువుచేత, మనికిచేత నాగర్భశ్రీమంతులై వీరు మహారాజభోగము లనుభవించినను, వీరి కవితా రచనలయందంతట ఆస్తికత్వము, ఆధ్యాత్మిక విద్యాతత్పరత, భక్తి జ్ఞాన వైరాగ్యములు ప్రకృష్టముగా భాసిల్లుచున్నవి. వీరు త్రిపురసుందరి భక్తులు. గణనాథుని కరుణవలన లభించిన గణేశ్వరీయము అన్నపూర్ణాసనాథుండగు కాశీనాథుని కంకితము. ఈ క్రింది గణేశ్వరీయాశ్వాస గద్యమువలన పై విషయములు స్పష్టమగును.

"ఇది శ్రీమత్త్రిపురసుందరీ మనోహర చరణారవింద మకరందాస్వాదనానంద తుందిలమిళిందాయమానమానస సౌందర్య లక్ష్మీసనాథ గణనాథావ్యాజానూన కృపాకటాక్ష సంప్రాప్త చతుర్విధ సుకవితారమోల్లాస సహజపాండితీవిలాస అష్టావధానవిధానధౌరేయ శ్రీ శ్రీమద్విజయనగర సామ్రాజ్య ధురంధర శ్రీమద్విజయరామ గజపతి మహారాజ కుమార మహారాజ రాజత్కృపాధేయ సకలసత్కవిజనవిధేయ సాంబశివ రఘురామ నామధేయ ప్రణీతంబైన శ్రీ గణేశ్వరీయ మహాగ్రంథమునందు సర్వంబును చతుర్థాశ్వాసము సంపూర్ణము."

గణాధిపతి పూజ చతుర్థిని జరుగును గావున, నా తిథిసూచకముగ తన గ్రంథమునందు చతురాశ్వాసములే గ్రంథకర్త రచించుట సమంజసముగ నున్నది.

గణేశ్వరీయ గ్రంథకర్త మహాకవి; ప్రాచీన కవులతో తులదూఁగఁదగిన ప్రతిభాశాలి. ఆ మనీషి కవితా వైశద్యమునకు గణేశ్వరీయము జ్ఞాన దీపకళిక. విద్వజ్జనములకు విశిష్టామోదము గల్గించి, విద్యార్థిలోకమునకు విపుల సాహితీ సంపద సమకూర్చి యీ కావ్య మాంధ్రప్రదేశమున విశ్వవిద్యాలయములలో, కళాశాలలలో, పాఠశాలలలో బహుళ ప్రచారము బడయుఁగావుత.

మదరాసు
20-7-1958

నిడుదవోలు వేంకటరావు.
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షుఁడు



మ. అలకాధీశ సుహృత్కుమారుని కుమారాగ్రేసరున్ రక్షితా
ఖిల భక్తస్తుతిలోలు శ్రీవిజయలక్ష్మీనాథు నిత్యోత్సవున్
బలభద్రాయితమూర్తి నాశ్రితజన ప్రత్యక్షనారాయణున్
దలఁతున్ సర్వహితానువర్తనపరున్ ధర్మార్థసంధాయకున్.

# శ్రీ గణేశ్వరీయము

కథావతారిక

క. పుణ్యము, మునిశేఖర గణ
గణ్యము, తరుకుంజవాటికాఫలసుమ లా
వణ్యము, నైమిశనామా
రణ్యము, మృగపక్షిచయ శరణ్యము చెలఁగున్.

ఉ. ఆ వనమందు మౌనులు, మ
హాత్ములు నొక్కట సత్రయాగదీ
క్షావిధి నుండి, సత్కథలఁ
గాలముఁబుచ్చుచు, నీశ్వరప్రభా
వావధిఁ గానలేక తమి
నాఁపఁగఁజాలక కౌతుకంబు సం
భావన మీఱ సూతుఁగని
పల్కిరి యందఱు నొక్కతీరుగన్.

మ. "అనఘా! నీ వెదలోఁ నెఱుంగని పురా
ణార్థంబులున్ శాస్త్రముల్
దనరంబోవు; పరాశరాత్మజకృపన్
మాభాగ్యముల్గూడఁ బం
డెను; నీవంటి మహానుభావుని దయన్
దేవేశ్వరాఖ్యానముల్
వినుచున్నారము, విందు మింక నిటు లు
ర్విఖ్యాతరుచుం గేరుచున్.

మ. కలికాలంబున నాస్తికాధములు దో
ర్గర్వుల్ మదోన్మత్తులుం
జలచిత్తుల్ మొఱకుల్ దురామయజరా
సంబాధితాంగుల్ జన
మ్ములలో నుందురు, వారి కెట్లు లిహమున్.
మోక్షంబు సిద్ధించు; స
త్ఫలదంబౌ చరితన్ వచింపఁగదవే
పాపోపశాంతంబుగన్.

తే-గీ. మంచికార్యమ్ముఁ జేయఁగా మనసురాదు;
వచ్చెనేనియు శక్తిలోపంబొ, ద్రవ్య
లోపమో, విఘ్నమో నిచ్చలును జెలంగు;
నట్టివానికి మోక్షమెట్లలవడెడిని ?

చ. చెవిఁబడునంత నేకథ వి
శేష సుఖంబు నొసంగు ? దేనిచే
నవితథ భోగభాగ్యముల
నందఁగవచ్చును? బాపరాశి దే
నివలన రూపుమాయు? భవ
నీరధి దాఁటఁగ నావయెద్ది? త
త్పవిమల వృత్తముఁ దెలిపి
పావనులం బొనరింపు మమ్ములన్."

చ. అనవుడు సూతుఁడిట్లనియె
"నైహికభోగసుఖంబులున్ యశం
బు నొసఁగి, యంత నంతమున
ముక్తిని దప్పక కూర్చునట్టి పా

వనచరితంబుఁ దెల్పఁగల
వాఁడను; మీరును సావధానులై
వినుఁడు; గణేశ్వరీయ మను
పేరఁ జెలంగెడు నద్ది యీభువిన్.

క. మ్రొక్కినమాత్రన వరముల
నొక్కుమ్మడి నిచ్చునట్టి యోగ్య చరిత్రన్
వక్కాణించెద" నంచును
గ్రక్కున మొదలిడియె మునులు గౌతుకమందన్.

# కథా ప్రారంభము

## 1

చ. "తళుకులనీను రత్నముల తానక, మద్భుతధాతుజన్య కాం
తులకును దావలంబు, పరితుష్టనిలింప విహారభూమి, ని
స్తులఫల పుష్పభూషితము, సుందరసానుసమంచితంబు నై
కలదొక కొండ యుత్తరముఖంబున రాజతపర్వతం బనన్.

చ. తెలతెలవాఱు వేళల న
దీజలమధ్య సరోరుహాంబులన్
వెలలిన భృంగసంతతుల
విస్ఫుట ఝంకృతులున్, శుకాది ప
క్షుల కలనిస్వనంబులును
జొప్పడి, తద్గిరి నిద్రఁగూరు వా
శలకును మేలుకొల్పులయి
శ్రావ్యతరంబుగ వీనులంబడున్.

మ. ఉదయాద్రిం బొడసూపు భానుకిరణ
వ్యూహంబు తత్పర్వతా
స్పదఖర్జూర సితచ్ఛటామిళితమై
సానూపరిస్వైర స
మ్మదఖేలాపరితృప్త దేవతరుణీ
మందస్మితాస్యమ్ములన్
గదియుం దద్విటకోటి వింతపడి శం
కంజూచు నమ్మార్పులన్.

మ. కరికుంభమ్ములమీఁదికిం దుమికి, చ
క్కన్నిక్కి కూర్చుండి, హ
స్తరుహాంబుల్ నిగుడించి, చీల్పక విలా
సక్రీడగా గీరులన్
వరుసం బెట్టెడు సింహశాబకములన్
భ్రాంతిన్విలోకించి, క
న్నరకంజాతుల మేలమాడుదురు త
న్నాథుల్ సముత్కంఠులై.

ఉ. తక్కుచుఁ దారుచుం జను స
దాగతి కీచకకోటరమ్ములం
దొక్కటఁ జొచ్చి వెల్వడెడు
నుద్ధతిఁ బుట్టిన సుస్వరంబులన్
మక్కువ నాలకింపుచును
బ్రాన్పడినిల్చు మృగాళి; వైరముల్
లెక్కడ; వేక కార్యరస
లీన మనస్కులు వైరమెంతురే?

సీ. నానావిచిత్ర రత్నప్రభాజాల సం
గతసముత్తుంగ శృంగములతోడ,
ఆరామతరునికుంజావాస బహుపక్షి
సముదయ కలనిస్వనములతోడ,
సురసిద్ధసాధ్యకిన్నర యక్షమిధున వి
హార యోగ్యనదీనదాళితోడ,
గంధర్వకామినీ కరగతవీణాస్వ
రప్రతిధ్వనిత మార్గములతోడ,

తే-గీ. పుణ్యపూరుష సురసతీ భోగ్యమాన
పారిజాత ప్రసూన తల్పములతోడ
సుకృతవంతుల భాగ్య విస్ఫుటఫలంబు
వగిదిఁ దనరారు రాజత పర్వతంబు.

వ. మఱియును, జూత పారిజాత మందార కోవిదార నాగ పున్నాగ సాల తమాల హింతాల రసాల తరునిచయావాస శుక పిక ముఖ శకుంతసంతాన కోలాహలస్వన బధిరీభూత దిశాకాశావకాశంబును, గండభేరుండ శరభ సింహ వ్యాఘ్ర వరాహాది నానావిధ భయంకర జంతు గర్జారావ ప్రతిధ్వనిత కందరంబును, భవ్యకాసారాంతరస్థ కమలవనీ విహారమాణమిళిందసందోహ నినదరంజితరమణీయ దేవతా రమణీ సమూహంబును నై, గర్విష్ఠచిత్తంబువగిదిఁ బెచ్చు పెరిగి, సజ్జనమానసంబుంబోలె స్వచ్ఛమై, వేదంబులగతిం బవిత్రమై, సత్ప్రబంధంబువోలె ననన్యసామాన్య విచిత్ర వస్తు భూయిష్ఠంబై చెలువాఱు నేతత్పర్వతంబున.

ఉ. వాసము సేయుచుండు మునివర్గ మనస్సరసీజ భానుఁ, డ
బ్జాసనవాసవాది దివిజాలయవాస మయూర మేఘుఁ, డా
ర్యాసరసీరుహాక్షి హృదయాబ్జ మరందమిళింద, మాశ్రిత
త్రాసవనీదవానలుఁ,డుదారకృపామయుఁడీశ్వరుండుదాన్.

క. మును లనయము దన వైభవ
మును గొనియాడంగ, నద్రిపుత్రిక సేవం
దనుపఁగ నభవుఁడు భవ సౌ
ఖ్యనియామంబులను దేలు నట చిత్రగతిన్.

చ. భవములఁ బాపి భక్తుల న
పారకృపామతి నేలి, ద్వంద్వముల్
దవులఁగనీక, ముక్తివని
తాస్థిరసంగతిఁ గూర్చు తా నిటుల్
భవనము, భార్య, భృత్యతతి,
బంధువు లంచును మాయయైన యీ
భవనియమంబులం దవులు
పద్ధతి చిత్రముగాఁగఁ గన్పడున్.

తే-గీ. మారుని వధించె ననుమాట మాపుకొనఁగ
నెంచిరో, లేక లోకమ్ము లిట్లు మెలఁగి
సృష్టిఁ దోడగునంచు వచించుకొఱకొ
శర్వుఁ డీఁదును సంసార సాగరమున,

మ. జనసామాన్య విధంబు దొల్దొలుత సం
సారంబ యాప్తైని ము
క్తినిగాంక్షించుటయంచు లోకములలోఁ
దెల్లంబుగానున్న నూ

ప్రతినియామంబును దాన తప్పిన "యథా
రాజా తథా తత్ప్రజా"
యని తన్ బోలి చరింతురెల్లరనియో
యర్చించుఁ దా సంస్కృతిన్.

క. కాకున్నఁ దనకు నేటికిఁ
జీకాకువడంగ ననుచు శీఘ్రము దానిం
బోకార్చుకొనఁడె? తనకున్
దేఁకువ నెఱుఁగంగరానిదియునుం గలదే?

ఉ. మాయను జాయఁ జేసికొని
మానుషధర్మములూని లోకముల్
మాయన సంసృజించి, తన
మాయ నొరుల్ గనకుండునట్లు లే
దో యొక మాయఁబన్నెడు మ
హోన్నతుఁ జిన్మయుఁగూర్చి చర్చలన్
జేయఁగ శక్తుఁడుండునొకో!
చిత్రము లాతఁ డొనర్చు కార్యముల్.

ఉ. సృష్టినొనర్చు, రక్షణము
సేయు, హరించు, సమర్థతం బున
స్సృష్టినొనర్చు; నీగతి న
శేషవిలాసుఁడుగా నెసంగు నా
శిష్టశరణ్యు, దుష్టజన
శిక్షణు బ్రహ్మయు విష్ణువైన వి
స్పష్టముగా నెఱుంగ రసఁ
బల్కెడిదేమిఁక మమ్ముఁబోంట్లకున్?

క. మాయారూపయు, సకలా
మ్నాయార్థవిలాసపావనవ్యక్తియుఁ, ద
చ్ఛాయా మాత్రయు నగు కా
త్యాయని యొకవేళ నెఱుఁగు నాతని విధముల్.

క. ఎవ రెఱిఁగిన నెఱుఁగకయు
న్న విశదము మహేశ్వరుం డనంతుం డయ్యున్
భవనము భార్యను గైకొని
యవిరళముగ నుండు రాజతాచలమందున్.

వ. అట్లు వాసంబుండి యొక్కనాఁడు——

సీ. దర్శనమాత్ర నుత్సాహంబుఁ జెందెడి
సురసిద్ధ సాధ్య కిన్నరులతోడ,
నాత్మలఁ దన్ సదా ధ్యానించి యానంద
మున నోలలాడెడు మునులతోడఁ,
బరిచర్య గావింపఁ దఱి యబ్బునా యంచుఁ
గాంక్షించు ప్రమథ సంఘంబుతోడ,
భక్తితత్పరతఁ బుష్పవ్రాతములఁ జేత
నందిచ్చుచున్నట్టి నందితోడ,
తే-గీ. వింతఁజూచెడు దిక్పాల వితతితోడఁ,
బ్రణుతిఁ గావించు భక్త వర్గంబుతోడఁ
బార్వతీదేవి నంకంబుపైని దాల్చి
నిండుకొల్వునఁ గూర్చుండి యుండె భవుఁడు.

శ్రీ గణేశ్వరీయము

చ. మునులు తదీయమూర్తిఁగని
మోదముతోడను మానసముద్రితా
నను లయి చూడ, దిక్ప్రతిగ
ణమ్ము పరాత్పరమూర్తి తేజమున్
గనుఁగొనలేక దిక్కులను
గాంచుచునుండ, నిలింపయావతం
బనితరభావ మందఁ బర
మాత్ముఁడు దేజరిలెన్ సభాస్థలిన్.

సీ. జడలలోనుండి దాఁగుడుమూఁత లాడుచు
గంగా సరోజాక్షి తొంగిచూడఁ,
దల నవతంసమై తళుకుల నీనెడు
బాలేందురేఖ విభ్రమము నోడ,
మెడను హారమ్మలై మిసమిసలాడుచుఁ
గుంభీనసంబులు గునిసియాడ,
నంకస్థలంబున నధివసించిన గౌరి
మందహాసంబుతో మాటలాడ,

తే-గీ. శాంత మాకృతిఁదాల్చిన సరణి, కరుణ
మూర్తిఁ గైకొనినట్లు సంపూర్ణమైన
తేజమై కొల్వుఁదీర్చిన దేవదేవుఁ
గాంచి రెల్లరుఁ గన్నుల కఱవు దీఱ.

సీ. "ఇతఁడె మార్కండేయు నెక్కటి రక్షింప
మృత్యువుం దునిమిన మేటిమగఁడు,
ఇతఁడె గజాసురుం ద్రుటిలోన గెల్చి ప్ర
పంచంబుఁ బ్రోచిన బాహుబలుఁడు,

ఇతఁడె హాలాహలం బెలమిని మ్రింగి లో
కములఁగాచిన యుపకారపరుఁడు,
ఇతఁడె రాక్షసపుర త్రితయమ్ము మర్దించి
యద్వితీయుండైనయట్టి మూర్తి,
తే-గీ. ఇతఁడె సృష్టింపఁబడిన వస్తుతతియందుఁ,
బంచభూతములందు, విరించియందు,
సకలదేవతలందు, విష్టపములందు
నిండియుండు మహానుభావుండు సుండు.
తే-గీ. చిన్నినగవున జగముల సృష్టిసేయు,
భ్రుకుటిమాత్రన హరియించు భువనములను,
దానె సర్వమ్ము తనలోనఁ దాల్చు సర్వ
మనుచుఁ బొగడొందునట్టి మహాత్ముఁ డితఁడె.
సీ. అల్పసంతోషి యీ యఖిలేశు మ్రొక్కుఁడీ,
కష్టమ్ములెల్లను గడకుఁ దొలఁగు;
సులభుఁ డీయీశ్వరుఁ గొలువుఁడీ మువ్వేళ,
మృత్యువై నను మీకు భృత్యుఁడగును;
కరుణాస్వరూపుఁ డీ హరు నాశ్రయింపుఁడీ,
యశుభపరంపర లడఁగి మడఁగు;
సత్వంబు నీపరతత్వంబు నెంచుఁడీ,
ముక్తి మీయందు నాసక్తిఁ జెందు;
తే-గీ. జ్యోతి నాద్యంతరహితు నీ శూలపాణిఁ
బలుకుఁడీ నోట, నిస్తారములు లభించు”
ననుచు నందీశ్వరుండు వర్ణనము సేయ
జయజయధ్వని సభయుఁ దన్మయత నుండె. (అంత)

చ. కరమునఁ గంకణప్రతతి
గల్లన మ్రోవఁగ వీఁచుచున్న సుం
దరులను లేఁతనవ్వొసన
తద్దయు నాఁపి, నుతించు నంది నే
త్రేరఁ గృపఁ జూచి, సభ్యుల న
తిప్రమదంబునఁ బల్కరించి, శం
కరుఁడు ఘనాఘనస్వరము
గ్రాల నిటు ల్వచియించె వారితో.

ఉ. "సేమమె మౌనివర్యులకు ?
శ్రేయమె దిక్పతిరాజికిన్ ? శుభ
మ్మే మన దేవతాళులకు ?
నీప్సితసిద్ధిని భక్తులెల్ల మ
మ్మేమఱకుందురే ? దనుజు
లెందునఁ ద్రుళ్ళిపడంగ లేదుగా ?
యేమియుఁదక్కువైన వచి
యింపుఁడు, దీర్చెద నట్టిలోపమున్."

క. అని కరుణ వెలయఁ జిఋన
వ్వనఁ బల్కినవాసిఁ బరమ పూరుషుఁ గని యం
మ్మునులుం, దక్కినవారును
గొనియాడిరి మనములందుఁ గొనకొనుభక్తిన్.

క. అట్టియెడ మాటలాడఁగ
గట్టితనము గలుగువాఁడు, గానమునందున్
బెట్టిన పేరై యొప్పెడు
నట్టిఁడు నారదుఁడు లేచి యభవున కనియెన్.

శా. "దేవా! నీకరుణావిశేషము గడుం దెల్లంబు గావింప ని
ట్లేవో మమ్మడుగందలంచెదవు గానీ నిశ్చయంబెన్న నీ
భావంబందు నెఱుంగరానిదొకడున్ భాషింపఁగానున్నదే?
యీవన్నింటను నిండియుండెదవు కాదే భక్తరత్నామణీ!

క. ఐనను దెలియనివాని వి
ధాన నడిగినావు గానఁ దగునుత్తర మే
నీనుంటి నాలకింపుము
జ్ఞానానందస్వరూప! సర్వేశ! శివా!

క. మునులకు సేమము; దిక్పతు
లును సేమంబున్నవారలు; దివిజులు సుఖ
మ్మున నుంద్రు; భక్తు లిష్టము
లను గాంతురు మిమ్ము లోఁదలంచుచు నెపుడున్.

ఉ. దానవు లెల్ల దేవతల
దారికి రారు; భవత్ప్రతాప దా
వానలభీతిఁ జెడ్డిరి;
యాశ్రితపాళికిఁ దక్కు వెందునం
గానము; మీరు లోకములు
గాచుచునుండెడు వేళ లోప మెం
దేనియుఁ గల్గనేర్చునె? మ
హేశ్వర! మ మ్మడుగంగ నేటికిన్?"

వ. అని నారదుండు సభాసంప్రదాయానుసారముగాఁ బ్రత్యుత్త
రం బీయ నెల్లరును సంతసించి; రట్టియెడ నీశ్వరాంకస్థాయిని
యగు కాత్యాయని నయ వినయ సంభ్రమంబులు ముప్పిరి
గొన, నపాంగవీక్షణమధుకరీ నికరంబుల నీశ్వరు పాదాంబు

జంబుల నలంకరించుచు, సర్వలోక జనని గావున నాఁ
దినము లోకమ్ముల కెద్దియే నుపకారంబుగావించుట సభ
కర్తవ్యంబని యూహించి, పతి నుద్దేశించి, కలనిస్వనంబుః
నిట్లనియె.

శా. "దేవా! నామనమందునంగలుగు సం
దేహంబు వారింపు; ని
న్నేవాఁడేనియుఁ గాంచనెంచు నెడఁ దా
నేరీతిఁ బూజాదులన్
గావింపన్ వలె? ముక్తిమార్గమునకుం
గర్తవ్యమెట్లుండు? నా
కీవృత్తాంతముఁ దెల్పుమా" యనుడు వి
శ్వేశుండు లో నవ్వుచున్.

శా. "దేవీ! నీవిడినట్టిప్రశ్నమున నే
దీపించు సర్వంబు; స
ద్భావజ్ఞుల్ సభయందు నున్న మును లీ
ధర్మంబు లెట్లుండెనో
నావాక్యంబుల నాలకించుటకు స
న్నాహంబులై యున్నవా;
రీవున్ గోరితి; గానఁదెల్పెదను, నా
యేర్పాటు లాలింపుమా.

క. నీ వడిగిన ప్రశ్నంబుల
భావ మ్మొక్కటియె యగును బడఁతీ! భక్తుం
డేవాఁడు నన్నుఁ గన్గొను,
నావానికి ముక్తి సిద్ధమై యలరారున్.

క. ననుఁ గాంచుటె ముక్తియనం
గను; ముక్తిం గాంచుటన్న గరితా! నన్నున్
గనుఁగొనుటె; యుభయమున భే
దనియతి యొక్కించుకేని దనరదు సుమ్మా.

వ. దేవదేవుండైన నన్నుఁ దెలిసికొను మార్గమ్మును, బూజించు వెఱవు నడిగితివి గావున సావధానవై యాలింపుము: కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లను నరిషడ్వర్గంబును విడిచి, మమకారసంజనితాభిమానంబు దిగఁద్రావి, సదా నామూర్తి నంతరంగమున నిడి, మత్కృత లోక సంరక్షణ హేతుభూత కార్యంబుల నాకర్ణించియు, ననంతంబులగు మద్గుణంబుల నభివర్ణించియు భక్తిసంభరితుండై యుండు పురుషుం డాత్మకును, నాకును భేదంబుఁ బాటింపమింజేసి నాయం దైక్యసిద్ధినొందు; సకలామ్నాయ బోధితాచార సంపన్నుండై, పదార్థతత్త్వ విజ్ఞాన సంపూర్ణుండై, మత్సేవకన్నఁ గైవల్యంబును, భక్తికధికంబగు మనశ్శాంతియు లేదని నాయెడల మనసు లగ్నము చేసి, మదర్పిత సర్వకర్ముండై పద్మపరిస్థిత జలబిందువు పగిది సంసారంబున నంటియు నంటక మెలఁగువాఁడు సర్వాంతర్బహిర్వ్యాపకంబగు నాతేజంబును సర్వవస్తు సమితియందును దిలకించుటం జేసి, యంతంబున నిరంతరంబగు ముక్తిం గైకొనుచుండును."

తే-గీ. అనుడుఁ బార్వతి యనియె "సర్వాధినాథ!
నాథ! పరిపక్వమైన పుణ్యంబుచేతఁ

గాని సాధింపఁబడని మార్గంబుఁ జెప్పి;
తింత కేదేని సులభంబు నెఱుఁగఁ దెల్పు."

క. అనవుడు శంకరుండనియె
"నౌ; నిది నిర్గుణ తత్త్వమౌచు, యో
గనియతి నన్నుఁ జేరుకొనఁ
గాఁదగు మార్గము; సర్వపుణ్య సం
జనిత ఫలంబు లేక కొన
సాగదు గాన సులభ్యమౌనవై
తనరెడు రీతిఁ దెల్పెదను
దద్విధులే సగుణాభిధానముల్.

చ. మన మొకటన్ జలించు; నభి
మానము పై కొనుచుండు; వాంఛలున్
గనఁబడుచుండు; నాత్మ మమ
కారము గ్రమ్ముచునుండు; సంసృతి
ప్రణయము హెచ్చుచుండు; నన
వద్యము తత్త్వమును దోఁచకుండుఁ; గా
వున నటువంటి వారలకు
బోధ్యము లీ సగుణమ్ములే సుమీ.

వ. అవి యెట్లంటేని సగుణస్వరూపములే ప్రధానంబని నా యా
కారంబు విగ్రహాదులయందు నిరూపించి, యవ్వాని నారా
ధించియు, నుత్సవాదికమ్ములం దనిపియు, నన్నుఁ బ్రత్య
క్షంబుగా సేవించితిమని మనస్తాపోపశమనంబుఁ గల్గియుండు
వారలు క్రమక్రమంబున భక్తిప్రధానులై యైహికభోగ
భాగ్యంబులం దనిసి యంతంబున నన్ను జేరుచుందురు.

కై వల్యాసక్తులకు సులభమార్గంబు భక్తియే సుమా. అట్టి భక్తికి నేనె బద్ధుఁడనై మెలఁగుదుననిన నింకొండు దుస్సాధంబగునే? అట్టి వాత్సల్యంబు నాయందుండుట నెఱింగి కాదే రాక్షసులు నన్నారాధించుటయు, ననన్య సాధ్యంబులగు వరంబులం బడయుటయు, నీదివిజలోకం బుపద్రవంబందుటయుసంభవించుచున్నయది.నావాత్సల్యం బిన్నివిధములచే నగపడుచున్నను నాధివ్యాధిపీడితమ్ము లగు శరీరంబులు శాశ్వతంబులని, మమకారంబులఁ జిక్కువడి, యాశాపాశంబులం దగిలి, ప్రకృతి కృత కార్యంబులయందలి కర్తృత్వంబు నహంభావంబునం జేసి మీఁదవైచుకొని, యజ్ఞానాంధకారంబునం బడి మూఢులై యెంద ఱిహపరంబులకు దూరంబగుట దటా సించుచున్నయది!" యన విని దేవి మరల నిట్లనియె:

ఉ. "దేవర యానతిచ్చిన వి
    ధిన్ దమమందునఁ జిక్కియున్న మూ
ఢావళి యెన్నఁడేనిఁ బథ
    మందుఁ బడంగను, ముక్తిగాంచఁ గా
లావధి యున్నదో? మొదటి
    యట్టులె దుష్పథమందుఁ బుట్టువున్
జావును జెందఁగావలెనొ?
    నాథ! యొకింత యెఱుంగవచ్చునే?"

వ. అన నంత శంకరుండు, "దేవీ! మోక్షంబునందు లోభ గుణం బారోపింప వలదు. కాలభేదం బుండునే కాని ప్రతిజీవియు మోక్షం బందితీరవలయు. నీవడిగిన మూఢ

జనులకును మోక్షంబు కల. దది యెట్లంటేని, జన్మమెత్తిన దాది మరణ మొందువఱకును గలకాలంబు మూఢున కైనను బుణ్యపాప మిశ్రణంబయియుండు; అందుఁ బాప మెక్కుడును, బుణ్యం బల్పంబునునైన నగుఁగాక గాని పుణ్యవిహీనంబైన జన్మంబుండుట తటస్థింప; దట్లు బహు జన్మ సంచితపుణ్యఫలంబు క్రమక్రమంబున నభివృద్ధినొంది, పాపంబు నడంచుటయేకాక, దేహికి మోక్షకారణంబగు" నని యుపన్యసింపఁ దనివోని చిత్తంబుతో మరల దేవి యిట్లనియె: "దేవా! నీ కరుణావిశేషంబునంజేసి నేఁ డతుల రహస్యంబు లెల్లవారలకు నెఱుంగనయ్యె. కాని నా మనంబున నింకొక్క సందియంబు బాధించుచున్నయది. దేవరను సర్వదా సర్వజ్ఞుండని జగంబులు వక్కాణించెదు; నట్టి మీమనంబునకు మోహంబునంజేసి ప్రజ్ఞం గోలుపోవుట యెన్నఁడేనియుఁ దటస్థించునా? సెలవిం"డన దరహాసితవదనారవిందుండై యీశ్వరుం డిట్లనియె:

మ. "గరితా! బేలతనమ్మె? జాణతనమో?
కాకున్న సర్వజ్ఞుడన్
బిరుదుం దాల్చిన నన్ను నిట్లడుగుదే?
విశ్వంబు లల్లాడవే?
శరధుల్ ఘూర్ణిలి పొంగి పాఱవె? దిశా
చక్రంబు సూర్యౌషధీ
శ్వరబింబమ్ములు మాయవే యకట! ప్ర
జ్ఞ న్నేన కోల్పోయినన్?

క. ఐనను దెల్పెద, నొక్కట
మానివరులు, భక్తగణము మానసముల నన్
ధ్యానించుచుఁట్టిపట్టునఁ
జానా ! తన్మయుఁడ నగుదు సంతోషముచేన్.
క. తెలివా ! యింకొకయెడ నే
త్తైఱ మోహము నొందుచుందుఁ, దెల్పెద వినుమా!
చిరపరిచిత మాయవు నీ
దరి నొక్కొకయప్పు డట్టి తడఁబా టొదవున్.
ఉ. మాయవు, లోకజాలములు
భ్రమం దెడిపట్టునఁ గూడ నించు కేన్
మాయవు, సర్వకారణ ఘ
న ప్రతిభామతి వౌట నిన్ను రా
మా ! యవునంచుఁ గాదనుచు
నాడఁగఁజాలక యొక్కటొక్కటన్
మాయను జిక్కికొందు, నణు
మాత్రములో దిగఁద్రోతు దానినిన్.
ఉ. సారము లేనిదంచుఁ బెలు
చన్ మనమందు నెఱింగియుండి, సం
సారమునం దగుల్కొనిన
చాయను నే నిటులుంట నీదయా
సారము చేతఁ గాదె ? యిట
సమ్మతినుండియుఁ దామరాకుపై
నీరము పోల్కి నన్ను గ
ణింపను బజ్ఞను గోలుపోవనేన్."

వ. అనుడు దేవి, "దేవా! నీవిశేషంబు లనంతంబులు. నీ వెవ్వారి మాయలం జిక్కక, సర్వదా సర్వారాధ్యుండవై యుండుదువు. నేనును నీయందు భక్తిగలదాన నగుటం జేసి కదా నీ పాదాంబుజంబుల నిరంతరము సేవించు భాగ్యము గలదాననైతి; నీ వాత్సల్యం బపారం" బని యనేకవిధంబులం గొనియాడె. నంత మానీశ్వరులును, దిక్పాలగణాదులును లేచి, వినమ్రులై, "దేవీ! తావకీన కృపావిశేషంబునం జేసి నేఁడతుల రహస్యంబుల నెఱింగితి" మని వినుతించి, యా పార్వతీపరమేశ్వరుల యనుజ్ఞ వడసి నిజవాసంబులకుఁ జని. రంత జగద్రక్షకుండు నగాత్మజం జూచి యిట్లనియె:

శా. "బాలారత్నము! నన్నుఁగూర్చి యెదలన్
భావించి పూజించు భ
క్తాలాపంబులు, వేదమంత్రములు లో
నాలింపఁగావచ్చె; నా
యా లోకంబులఁ జూడఁబోయెదను బ్ర
త్యక్షంబుగా; నిప్పుడీ
కైలాసంబున నుందో? నీ వటకు రాఁ
గాంక్షించెదో?" నావుడున్.

చ. పలికెను దేవి, "మిమ్ముఁగద!
భక్తులు పిల్చుచు నున్నవార; ల
వ్వలనికి మేము వచ్చుటది
భావ్యమె? దేవర యేఁగి వారికిన్

వలసిన కోర్కులిచ్చి, భువ
నంబులు గ్రుమ్మరివచ్చులోన లో
పలఁజని మజ్జనంబొనరు
పం దమివుట్టెడు; నాజ్ఞయీఁగదే!"

వ. అను పలుకుల కీశ్వరుండును "దేవీ! నీ యిచ్ఛవచ్చినట్లు మజ్జనంబొనరింపుము. నేనును శీఘ్రకాలమ్మునఁ గ్రుమ్మరి క్రమ్మఱి రాఁగలవాఁడ"నని వాక్రుచ్చి నందీశ్వరు నధిరోహించి సరభసగమనంబునం జనియె"నని సూతుండు. నైమిశారణ్యవాసులగు మానివర్యులకుఁ దెల్ప వారును సంభ్రమితచిత్తులై "యవ్వలి వృత్తాంతంబు సెలవిచ్చి మమ్మానం దనియింపవే" యన,

2

క. వినయమున శౌనకాదులు
జనితామోదమునఁజేసి సంప్రశ్నింపన్
ఘనపుణ్యుఁడు సూతుఁడు తన
మన మానందాబ్ధిఁ దేల మఱి యిట్లనియెన్:

శా. "శ్రీకంఠుండు ప్రయాణమై చనుడు గౌ
రీదేవి దేవాంగనా
నీకంబుం దను డాయఁబిల్చి, కరుణ
న్వీక్షించి, "నే మజ్జనం
బాకాంక్షించుచు నున్నదాన; సఖులా
రా! శీఘ్రమే మీర లా
యాకార్యంబులఁ జేయుఁడీ" యనఁగ వా
రాశ్చర్యముం జెందుచున్.

ఉ. "అంబ స్వయంబుగా నె యిటు
లాజ్ఞ యొసంగె నిదేమొ నేఁడు భా
గ్యం" బనువారు, "దేవి మన
యందుఁ బ్రసన్నతఁ జూపె"నంచుఁ జి
త్తంబుల నెంచువారు, "మన
తల్లికి సేవయొనర్పఁగల్గెఁ, బు
ణ్యం" బనువారు నై సుదతు
లందఱు సంతసమంది రొక్కటన్.

చ. కలకల నవ్వి యొక్కతె ము
ఖాముఖి వేఱొక కాంతఁ జూచి "యి
వ్వలనకు రాకు మీవు సుర
వంద్యపదాంబుజ దేవి నాకిటన్
నిలువఁగఁ దెల్పె; నింకొకప
నిం జను మీ"వని పట్టి త్రోయ, న
ప్పొలఁతుక భాగ్యమెల్ల సరి
పోయినరీతిని దీనతం జనున్.

శా. "ప్రాలేయాచల కన్య తెల్పినటు గా
ర్యంబెల్లఁ గావింప కీ
లీలం గ్రుమ్మరె దేల బేల!" యనుచున్
లేశంబులెక్కించి వా
చాలత్వంబును జూపు సిద్ధవనితం
"జాలింపు నీగోల గ
య్యాళీ!" యంచు నదల్చు వేఱొకట సా
ధ్వస్త్రీ వివాదార్భటిన్.

ఉ. యక్షమృగాక్షి యొక్కతె స
మక్షమునం గల యొక్క కిన్నరా
క్షాక్షిని బట్టి "కిన్నరత,
యశ్వముఖంబును గల్గు మీకు బు
ద్ధి క్షమ యేడఁగల్గు"నని
దెప్పుచునుండఁగఁ జూచి దవ్వునన్
దక్షుని పుత్త్రికామణి యు
దల్చెను దానిని గన్నుసైగచేన్.

చ. మనసిజు దంతియో యనఁగ
మందగతిం జనుదెంచు నొక్క సి
ద్ధ నళిననేత్ర వెన్కనె ము
దంబున వచ్చుచున్న గుహ్యకాం
గనఁ గని యోర్తు, "సార్థకతఁ
గాంచితె! పెన్నిధులట్టులున్న యా
ఘనజఘనంబుఁ, గ్రొమ్ముడియుఁ
గాచుచునుంటివె సుందరీ!" యనెన్.

శా. కాలౌచిత్యమెఱింగి యివ్విధములం
గాత్యాయనీపాద సే
వాలాభంబున కాత్మలం బరవశ
త్వంబందె దేవాంగనా
జాలంబు ల్దమలోన గూఢ పరిహా
సస్ఫూర్తి దీపింప న
ర్మాలాపంబులు పల్కికొంచుఁ దత కా
ర్యస్ఫూర్తి వర్తింపుచున్.

క. గంతులు వేయుచు, నెడ నెడఁ
బంతంబులు వలికికొనుచు బహువిధముల న
క్కాంతామణు లెంతేనియు
సంతోషము నందుచున్న సమయమునందున్.
సీ. ఫాలపరీభూత బాలేందుకళ యవ
తంసభావంబున దానిఁ గొలువ,
అవయవకాంతిజితాభరణంబులు
దగు చోట్ల నుండి యూడిగముసేయ,
యానవిర్జిత మరాళాంగన దత్పదా
బ్జానుసారిణియయి యాశ్రయింప,
వాజ్నిరాకృత కీరవత్సకమ్ము గళమ్ము
చెంత భుజమ్ముపైఁ జేరి నిలువ,
తే-గీ. మందహాస నిరస్తమహామౌక్తికంబు
దాని సేవింపఁ జెంతనే తపముసేయ,
వేనలి భుజమ్మునందాల్చి వ్రేళ్లఁజొనిపి
విప్పుకొనుచును శర్వాణి వెడలివచ్చె.
తే-గీ. పుష్కలావర్త మేఘమ్ముఁ బోలె వేణి,
జారుచున్నట్టి పూలు వర్షమ్ముఁబోలె,
నందు నెడ నెడఁ దిరుగాడునట్టి వ్రేళ్లు
మెఱపులంబోలె మిక్కిలి మెఱయుచుండె.
శా. వేణిన్ జేతను దాల్చి విప్పుకొనుచున్
విచ్చేయుచున్నట్టి శ
ర్వాణిం జూచి సభక్తిగౌరవముగాఁ
బాదంబులన్ మ్రొక్కి గీ

ర్వాణాబ్జాక్షు 'లనుజ్ఞ యే' మనుచు ని
ల్వన్, లేఁతనవ్వొప్పఁగా
వీణానాద సనాభిభాషణకళా
విస్ఫూర్తి దీపింపఁగన్.

ఉ. అంబ వచించె "మీకు నన
యంబును గూర్చెదు దాన, నాజ్ఞ లం
చుం బలుకంగ నేమిటికి
సుందరులార! ఘటించుచున్న కా
ర్యంబులు పూర్తియౌ నెడల
నందఱుఁ జేరఁగవచ్చి మజ్జనం
బుంబొనరింపఁ జేయుఁ"డన
మోదముతోఁ జనె వారలందఱున్.

క. "లోకేశ్వరు నిల్లాలవు;
లోకంబులఁ బొరయునట్టి లోపములఁ ద్రుటిన్
లేకుండఁ జేయఁజాలుదు;
వీకరణిని గరుణఁదాల్చితే మాయెడలన్?

ఉ. శాంతియె కోక, కంచుకము సజ్జనరక్షణ, మాశ్రితాళి న
శ్రాంతముఁ బ్రోచుటట్టిపని రమ్యతరాభరణంబు, సత్యమే
సంతత భోజనంబయిన సాధ్వివి; నీకు హితఃబు సేయ మే
మెంతగ నోచియుంటిమొ సుమీ! గిరిరాజ కుమారికామణీ!

శా. నిన్నాత్మం గయిసేసి కొల్చునెడఁ బ్రా
ణిశ్రేణి యంతంత నా
సన్నంబై చనుదెంచు మృత్యువును భా
స్వచ్ఛక్తి నిర్జించి య

తౌన్నత్యంబును బొందువారనఁగ
న్యంబేల వ్రాయుదు? నిన్
గన్నారంగని సేవఁ జేయఁగల భా
గ్యంబన్న సామాన్యమే?

ఉ. పూవులయాస లేదు, తలపోయవు పెద్దగ వస్త్రజాలముల్
గావలెనంచుఁ, గోరవధికంబగు భూషల, దానకార్య సం
భావన లెక్కపెట్ట; వొక భక్తికిమాత్రమె చిక్కియుందు వో
దేవి! భవద్విలాసములఁ దేఁకువ నెవ్వరెఱుంగ శక్తులే?

ఉ. తావకసింహనాద మొక
దారి వినంబడినంత బీరమున్
లావును డించి దైత్యులు ప
లాయనసూత్రములన్ బఠింత్రు; నీ
చేవనకాదె నిర్జరులు
చింతలు వంతలు వాసి సర్వ సౌ
ఖ్యావళిఁ గాంతు? రంబిక! కృ
తార్థుల మైతిమి నిన్నుఁ గొల్వఁగన్.

శా. చండంబై యురుదెంచు మిత్తి నిటలా
క్షుస్ఫూర్తి నీక్షించి మా
ర్కండేయుం జిరజీవిఁ జేయఁడె భవ
త్ప్రాణేశ్వరుం? డీవు బ్ర
హ్మాండంబెల్లను గన్నతల్లివలెఁ బ్రే
మం జూచి రక్షింపవే?
వండంబాటెఁగదమ్మ! నిం గొలుచు మా
భాగ్యంబు లీనాటికిన్."

మ. అని యెన్నేనివిధంబులం బొగడి ర
యః్యబ్జాక్షు; లామాటలన్
వినియున్ వారల భక్తిగౌరవములన్
వీక్షించియున్ సత్యమున్
గనియున్ శాంకరి యేమెఱుంగనటులే
కన్పట్టి "బాగాయె! మ
జ్జనమాడంగను వేళయయ్యె; సుదతుల్!
సాలింపుఁడీ మాటలన్".

క. అని పల్కుచు ననురాగ
మ్మునఁ జూచినయంత నొక్క పూఁబోఁడి వెసన్
జని, దేవిచేతి వేనలిఁ
గొని విప్పఁగసాగె గాఢ కుతుకముతోడన్.

క. తక్కినవారలు గొందఱు
మక్కువమై దేవిఁ జేరి మండనముల నొ
క్కొక్కటిగఁ దీసివుచ్చిరి
చక్కఁదనమ్మునకు మిగుల సంభ్రమపడుచున్.

వ. ఒక తొయ్యలి పర్వతరాజపుత్త్రికి నూనె యంటెను.
వేఱొక ముద్దరాలు దేవికి సంపంగి తైలమంటెను.

క. వారలు దలంటు తీరుల
నారసి, యటుగాదటంచు నహామహమికతోఁ
జీరఁ బిగఁగట్టుకొను చొక
సారసదళనేత్ర వచ్చె సండడి మీఱన్. (అట్లువచ్చి)

తే-గీ. మొగము గెందమ్మిపూచిన ట్లగుపడఁగ,
లే నడుము పట్టు బిట్టు చలింపఁ, జార

హారవల్లరు లూయెలచేరులట్టు
లూఁగ దలయంటె నా ప్రోఢ యుత్సవమున.

వ. ఇట్లు నానావిధంబుల నా దివ్య నాగరీజనంబులు దమ తమ ప్రౌఢిమంజూపి యద్దేవికిఁ దలయంటి, బహుళామోదపూరితంబులగు తైలపూరంబుల మేనికిం జరిమి, వివిధ సుగంధ వస్తుజాల పరిమళ సమంచితంబును, హరిద్రామిళితంబు నగు నుత్సాదనంబున నా సేచనకంబులును, సహజలావణ్యభూయిష్ఠంబులును, సర్వమంగళ ప్రదాన దీక్షానిధానంబులు నగు సర్వమంగళావయవంబులంబూసి నలుగువెట్టు నవసరంబున.

ఉ. కమ్మనివాసన న్వెలికిఁ
గ్రమ్ముచు లేపము సుప్రతీక భా
గమ్ముల యాకృతింబడఁగ
గారియుఁ గౌతుకపూరితాత్మయై
యిమ్ముగ వానిఁజేర్చి తన
సృష్టివిలాసముఁ జూపుచుండె నా
బొమ్మఁగఁజేసి చెంతఁగల
బోఁటులకున్ దమిమీఱఁ జూపఁగన్.

శా. వా రాశ్చర్యనిమగ్నలై యులికి శ
ర్వాణీ కృతాకారమున్
జేరంజూచి సకౌతుకంబుగ "జగ
త్సృష్టి ప్రధానోచితా

ధారవ్యక్తివి; నీకు నెయ్యెడ నసా
ధ్యంబుండునే? తల్లి! యీ
తీరుల్ బుద్ధిబలంబుగల్గిన విధా
తృండైనఁ జూపించునే ?

క. పరికర సాహాయ్యము లే
కరుదగు విగ్రహముఁ జేసి యగుపఱచితి; వా
పరికరములున్న విధి సి
గ్గఱి యే మోమునను సృష్టి కాదటఁ బూనున్?

శా. ఆయా లోకములందు వేదవిధులన్
యజ్ఞంబులం జేసియో
యేయుద్ధంబునఁ గూలియో సుభగులై
యే తెంచు భ్రాజోత్థిత
ప్రాయుల్ మాకడనున్న వా; రొకరి రూ
పంబైన నొక్కించుకే
నీయాకారముఁ బోలఁగాఁ గలదె? త
ల్లీ! మాట లింకేటికిన్?

చ. ఎడనెడఁ బుష్పబాణముల
నేయుచుఁ గ్రుమ్మరు కంతుఁ జూచినా;
మడరిన వేడ్క నందనవ
నాంతరమందు వసంతుఁజూచినా;
మెడఁదలఁ జూరగొంచుఁ జరి
యించు జయంతకుమారుఁ జూచినా;
మడుగఁగ నేల? యీ ప్రతిమ
యందలి తీరులు లేవు వారికిన్.

క. నలకూబరు సుకుమారత
కులుకుచుఁ జను రంభ బొమ్మరయొప్పును గనినన్
చలియింపదో? ముద్దిడి కౌఁ
గిలికిని జేర్పదొ ప్రమోద కిలికించితయై ?
ఉ. మాటలు వేయునేమిటికి?
మర్త్య నిలింప భుజంగ యావనుల్
నీటున వీనిఁ బోలుదురె ?
నెయ్యముఁ దియ్యముఁ దోఁప దీని కీ
పాటికిఁ బ్రాణదానము శు
భంబుగఁజేయుము; నీ తనూజుఁడై
గాటపుఁ గూర్మిఁ బూజలను
గైకొని మమ్ముల నేలు నిత్యమున్.
మ. చిరకాలంబున నుండి దేవవనితల్
చిత్తమ్ములం దెంతు "శ్రీ
గిరిరాట్పుత్త్రి కుమారు నెత్తుకొన
నీక్షింపంగ భాగ్యమ్ము లే
దె ! రమాసూనునిఁ జూచినాము ; విధి సా
ధ్వీరత్నమున్ సూను నే
డైటు నెత్తంగను జూచినా"మనుచు ను
ద్వేలోత్సుక స్వాంతలై.
క. మానస పుత్త్రుఁడు నీకున్;
ప్రాణము లీవమ్మ!" యనుచు బహువిధముల స
మ్మానము వెలయఁగఁ దెల్పెడు
చానలఁ గని పర్వతాత్మజ యిటుల ననియెన్:

ఆ-వె. "అమ్మలార! యింత ప్రార్థింపఁగా నేల?
మీకుఁ గలుగు కోర్కి నాకుఁ గలదు;
బ్రహ్మచెంత కనిపి ప్రాణముల్ పోయింతు;
నరయుచుండుఁ; డేల యాత్రపడఁగ ?"

వ. అన నం దొక్కతె యిట్లనియె:

ఉ. "చిత్తము మెచ్చునట్లుగ సృ
జించినదానవు, ప్రాణమీయఁగాఁ
బుత్తువె బ్రహ్మసన్నిధికి ?
బూమెలి వేటికి? నంతదాఁక మా
చిత్తము లెట్టులోర్చెడిని?
జీవము నీయఁగ లేవె ? నీవ యు
ద్వృత్తగఁ జేయఁగల్గు పని
కింకొక రేటికి మధ్య రావలెన్ ?"

క. అని పల్క దేవి యనుః "మీ
రనినట్టులు సేయవచ్చు; నైనను విధి కా
ర్యనియమములయెడ నిటులుగ
మన కేటికి జోక్య మింతమాత్రన చెపుఁడా !

తే-గీ. సృష్టికార్యాధినాథుండు; జీవదాన
కార్య మాతని; దాట నొక్కర్తు బొమ్మఁ
దోడుకొనిపోయి యాతనితోడ 'దుర్గ
యిటులు ననుఁ బంపె'నని తెల్పుటే యుచితము."

క. ఆవిధమున సఖులకు నిం
పావహిలఁగఁ జెప్పి యందు శ్యామానామన్

బూవుంబోండి నొక ర్తుకం
జేవిసరునం బిలిచి యాజ్ఞం జేసె నిటులుగన్.
శా. "శ్యామా! యీ ప్రతిమంబుం గైకొని విధా
త్రాస్థానముం జేరి, యం
దామాన్యుం డని మ్రొక్కి సర్వమును వృ
త్తాంతంబు వాక్రుచ్చి 'యో
స్వామీ! దీనికిం బ్రాణవాయువులు గూ
ర్పన్ మిమ్ము వేడంగ న
న్నిట్టైం బార్వతి యంపె మీ కడకు' నం
చేర్పాటుగాం జెప్పుమా!
క. జాలము సేయకు మచ్చటం;
గాలాతీతంబు నోర్వంగలమా మే మీ
బాలునిం జూచెదు నంతకు ?
బాలామణి! యెంతలోన వత్తువొ సుమ్మీ!
తే-గీ. జీవసంగతి నొందు నీ చిన్నిపాప
బుజ్జగించిన వఱకును మజ్జనంబు
నాచరింపక నీదైన యాగమనము
నిటు నిరీక్షించుచుందు మే మెల్ల బాల!"
క. అని పల్కు లోకమాతకుం
బ్రణుతి యొయిన్ శ్యామ వల్కె "వాక్పతికెల్లన్
విని చెద; నింతింత నె నీ
యనుంగుంగొమరుం దోడి తెత్తు" నని నవ్వుచుం దాన్.
శా. ఆనంగైకొని, బొమ్మం దోడ్కొని, సము
ద్యద్వేగయై వాగ్వరా

స్థానమ్మందునఁ జేరి, నమ్రత విధా
తన్ మ్రొక్కి, "లోకేశ దే
వి నైపుణ్యముఁ జిత్తగింపు" మని యా
వృత్తాంతముం దెల్పి యా
స్థానమ్మందున నిల్పె దాని, విధి యా
శ్చర్యాబ్ధిలో మున్గఁగన్.

వ. అట్టు లా ప్రతిమమ్ము ముందిడి.

చ. "అవయవ పూర్తిఁ జూచితివె?
యాకృతియందలి సంతనంబుఁ జూం
డవలసినట్టిదే కద! క
డంగి జగద్ధితకార్యమైన త
ల్లి విశదశక్తిఁ జూప నవ
లీలను జేసెను దీని; నిట్టి విం
త వఱకుఁ జూచియుంటివ టె?
తథ్యముఁ దెల్పు"మనన్ విధాతయున్.

చ. "చిరకాలమ్ముగ సృష్టికార్యములలోఁ
జిత్తంబుఁ జొప్పించి నే
ర్పరినైనాఁడ నటంచు నెమ్మదిని గ
ర్వంబందుచున్నాఁడ; నీ
వఱకు న్నన్ను జయించువా రొకటఁ గ
న్పట్టంగ లే; రైన శాం
కరి గావించిన తీరుఁ జూడ స్మయభం
గంబయ్యె, వెయ్యేటికిన్?

శా. ఏదోవంకను బెట్టు బ్రహ్మ యని న
న్నే వేళ లోకంబు ల
య్యో! దూఱున్; బరిపూర్ణ సృష్టి యన నే
నూహింపఁగాఁ జాల; నే
వాదుం జెందని సృష్టిఁ జూచితిమి శ
ర్వాణీ కృపాదృష్టి; శ్యా
మా! దేవీ మహిమావిశేషములు శ
క్యంబా నె లెక్కింపఁగన్?

తే.గీ. పొరపడియు దారితప్పియు బుద్ధిశక్తి
నూహఁజేసియు నీ విధి నొప్పు సొకు
మార్యముం గల్గు ప్రతిమ నేమంబుమీఱఁ
జేసి యెఱుఁగను, వెయ్యేల, చెప్పుచుంటి."

వ. అని జగత్సృష్టికారణుండగు ధాత యవ్విగ్రహ మ్మిటు
నటుఁ ద్రిప్పి చూచునవసరంబున శ్యామ యిట్లనియె:

క. "వాణీవల్లభ! దీనికిఁ
బ్రాణము నిడు మంచు మిమ్ముఁ బ్రార్థింపఁగ శ
ర్వాణి ననుఁ బంపె; నేనును
పోణిమి బాలకుని గొంచుఁ బోవలె నిపుడే.

క. అభ్యంజనసమయం బిది;
యభ్యంతరసీమ సఖులు, నామెయు సుతు వా
ల్లభ్యమునఁ జూడఁగోరెద;
రభ్యర్థించెదను, నన్ను నంపు" మనవుడున్.

తే-గీ. పంకజోద్భవుఁ డనియె "నో ప్రమద! యిట్టు
లద్భుతంబుగ సృజియించినట్టి తల్లి
జీవ మీయఁగ లేదె? నా చెంత కేల
యంపవలె? నామె యెఱుఁగని యంశ మేది?"

వ. అని, లోలోన నొక్కించుక శంకించియు, నామెయాజ్ఞ మీఱఁజాలక, యశుభంబుఁ బల్కనోపక భావికాలంబున నా వ్యక్తి యొందఁగల మహోన్నత్యంబు నెఱుంగువాఁడు గావునఁ బ్రాణ ప్రతిష్ఠాపన కార్యసాధనాయత్తుండై, యథోచిత మంత్రంబులను బఠించి, కమండలూదకం బా విగ్రహామస్తకంబునం జల్లుడు.

తే-గీ. కన్నులను విప్పుచుం, బ్రతీకములఁ గూడఁ
దీసికొని యావులించుచుఁ దేఱిచూచి,
మరలఁ గనుమోడ్చి, కనువిప్పి మంద మంద
గతులఁ దోఁచెను బొమ్మ యక్కజము దోఁప.

శా. లేచున్ బాలుఁడు; మెల్ల తప్పటడుగుల్
లెక్కించుచున్ వేయుచున్
జూచు న్వేడుకఁ జుట్టుప్రక్కఁగల వ
స్తు వ్రాతమున్; జేతులన్
జాఁచున్ వానిని బట్టుకొందమని; యం
తర్ధానమై యొక్కటన్
దోఁచున్ వేఱొకచోట, బ్రహ్మయును సం
తోషమ్ముతోఁ జూడఁగన్.

తే-గీ. దివ్య శృంగారరసము మూ_ర్తీభవించి
నటులు మున్మోదు వేడుక నాడుచున్న
బాలకుని జూచి శ్యామ సంభ్రమిత చి_త్త
పద్మయై యవ్యాఘాతతోఁ బలికె నిట్లు :

శా. "సుజ్ఞానోర్జిత సృష్టికార్యకలనా
శోభాయమాన ప్రభా
వజ్ఞా! సమ్మోద భారతీ మదవతీ
ప్రావీణ్య సందీపిత
ప్రజ్ఞా! యోగిజన ప్రబోధిత పర
బ్రహ్మాంబ! యోబ్రహ్మ! నా
కాజ్ఞ బాలుని వెంటఁబెట్టుకొని యా
ర్యాస్థానముం జేరఁగన్?"

క. అని సెలవు వేఁడి, కామ గ
మనమున బాలకునితో సమంచితగతి య
వ్వని తారత్నము కైలా
స నగము డాయంగవచ్చు సమయమునందున్.

ఉ. 'దూరమునందు బాలకుని
తో నరుదెంచెడి శ్యామ'యంచు నా
సారసనేత్ర లెల్లరును
సంభ్రమ శాసిత చి_త్తపద్మలై
ద్వారముఁ జేరఁగాఁజని, ము
దశ్రులు కండ్ల నలంకరింపఁగా
హారతులె_త్తి పాడి; రట
నంతకుమున్న గిరీంద్రపు_త్త్రియున్.

తే-గీ. ఆపదాగ్రంబు వ్రేలాడునట్టి కొప్పు
ముడుచుకొని, మంచి తెల్లని మడుఁగుఁ గట్టి
యాత్మజుని జూచు నుత్సాహ మలమికొనఁగ
ద్వారమును జేరవచ్చె నాత్రంబుతోడ.

ఉ. చేతము పుత్త్రిదర్శనము
చేత ముదబ్ధిని మున్గి తేలఁ, బ్రే
మాతిశయంబు వెల్లివిరి
యం "దనయా! ననుఁ గన్నతండ్రి! ద్వై
మాతుర! శంభుపుత్త్రి! సుకు
మార! కుమార!" యటంచు బాలునిన్
గౌతుకమార నెత్తుకొని
కౌఁగిటఁ దార్చుచు ముద్దులాడుచున్.

చ. కురులను దిద్దు మాటికిని;
గ్రోడమునందునఁ దార్చు; మూర్ధమున్
దఱుచుగ మూర్కొనున్; సముచి
త ప్రియ భాషలఁ బల్కరించుఁ; ద
త్కరయుగళిం దెమల్చి, తన
కంఠమునం బెనవేయఁజేయు; నీ
శ్వరి యభవప్రియమ్మనభ
వప్రియతన్ జెలువారె నొక్కటన్.

సీ. 'తండ్రీ!' యటంచు వాత్సల్యంబునం బిల్చి
తల్లిని జూచు నిదానముగను;
తనుఁ బట్టుకొనవచ్చు తరుణుల నలయింపఁ
బరిపరివిధములఁ బరువులెత్తు;

నడ్డంబుగా వచ్చు నంగనలను మోస
పుచ్చి పార్వతిచెంత వచ్చినిలుచు;
నిలిచి తన్గూర్చి కొండెము పల్కు కాంతలఁ
గ్రీఁగంట వీక్షించి కేరి నవ్వు;

తే-గీ. నవ్వి మెలమెల్ల మాతృ కంధరమునందుఁ
జేతులఁ దగిల్చి మోము వీక్షించు; నామె
కొసరి ముద్దాడ నొడిలోనఁ గూరుచుండు
బాలకుండు, విహార సంభ్రమ పరుండు.

క. 'దొరకియు నొరకక యిటులే
చరియించెద' నంచుఁ దెల్పు చాడ్పున సతులన్
మురిపించుచు మఱపించుచు
వెఱపించుచు బాలకుండు వేడుక చేసెన్.

ఆ-వె. తల్లి యీమె యంచు దర్శనమాత్రన
తెలిసికొనెడు శక్తి వెలయుఁ బిల్ల
లకును; గానినాఁడు లలన లందఱు నిల్వ
నతఁడు నగజచెంత కరుగనేల?

వ. ఇట్లు నానావిధ బాల్యక్రీడావినోదంబుల నున్న కుమారుంగని,పుత్త్రివాత్సల్యంబు లోలోన నలముకొన, శర్వాణి యాతని నొడిలోనిడుకొని, "తండ్రీ! ని న్ననుసరించువారల కసాధ్యుండవు కావలదు. నీయందలి యనురాగంబునం గాదే! యీ దేవకన్యలు నిన్ను వెంబడించుచున్నవారు. వారల కన్బ్రిముట యనుచితంబు. సర్వదా సులభసాధ్యుండవైయుండుట లెస్స. ఇదియ మన కుటుంబసంప్రదాయంబు.

కులాచారంబు విడిచిన నపకీర్తి వాటిల్లుఁ జుమీ!" అనుడు నాతండును లేచి. "తల్లీ! యెఱుఁగమిం జేసి వారి నలయించితి. నీయాజ్ఞానుసారంబు, నేఁడు మొదలుగా, నన్ననుసరించువారలకు సులభసాధ్యుండనై యుండుదు"నని పలికి, యయ్యంగనలన్ జేర, వారును—

సీ. 'ఇంతసోయగము ము న్నెఱుఁగమే కద'యంచుఁ
గూర్మి బాలకు నెత్తుకొనెడువారు,
'అంగసౌందర్యమం దంబనే పోలు నీ
బుడుతఁ'డంచును ముద్దు లిడెడువారు,
'కైలాసమెల్ల నీ లీలాస్థలం బింకఁ
బరువెత్తుమా' యంచుఁ బల్కువారు,
'తల్లిదండ్రుల పోల్కి నెల్లలోకములఁ బా
లింతువా' యని కౌఁగిలించువారు,

తే-గీ. ముద్దుసుద్దుల కాత్మల మురియువారు,
ప్రేమ 'దగ్గఱ ర'మ్మని పిలుచువారు,
గోరి నవ్వింపఁ జెక్కిలి గొట్టువారు
నైరి కైలాసమందలి యాఁడువారు.

తే-గీ. "అనుసరించినవారల కనవరతము
సులభుఁడనై యుండునని యిప్డు పలికినట్లు
మరలఁ బలుకుమ!" యనుచు నమ్మానవతులు
బాలకుని నోటఁ బలికింత్రు పలుపలుకులు.

శా. లీలాలోల మనస్కుఁడై మురియుచున్
లీలావతీజాల న
ర్మాలాపంబుల నాలకించుచు సమం
దానందముం జెందు న
బ్బాలున్ జూచి కుతూహలమ్మువడి శ
ర్వాణీ మహాదేవి, 'పు
త్రా! లావణ్యపయోనిధీ!' యనుచుఁ జే
రంబిల్చి నెయ్యంబునన్.

క. అంగము నివురుచుఁ దన యు
త్సంగమున నిడుకొని, కురులఁ దగ దిద్దుచు, ను
ప్పొంగుచు నుపదేశించెను
సాంగముగా విద్యలెల్ల నాయాగతులన్.

మ. ఉపదేశించినయంతమాత్రమున నం
బోక్తి ప్రభావంబుచే
నవురూపంబుగ బాలు బుద్ధి తత వి
ద్యావాసనన్ మించెఁ, బా
దపజాలంబు లనూన సూన ఫల సం
తాన క్రమవ్యాప్తి ని
త్యపురోవృద్ధి వసంతకాలమహిమన్
దళ్కొత్తు చందంబునన్.

సీ. విస్ఫుట దీప్తుల వికసించె నెమ్మోము;
కన్నుల కొక వింత కాంతి వచ్చె;
దేహమ్మునం దొక్క తేజంబు పొడసూపె;
బాహుల కనవద్యబలము తోఁచె;

వస్త్రభూషలును గన్పట్టె నొక్కటి మేన;
నవయవసౌష్ఠవం బమరుకొనియె;
సకలలోకంబులు స్వంతంబులుగఁ దోఁచె;
శస్త్రాస్త్రములు సహజమ్ములయ్యెఁ;
తే-గీ. జల్లచల్లఁగ బాల్యమ్ము జాఱిపోయెఁ;
త్రిభువనైకవిలాస మూర్తిస్వరూప
మునకు సుకుమారతయుఁ దోడుగను జెలంగె
బాలునకుఁ బార్వతీప్రభావమునఁ జేసి.
తే-గీ. ఆతఁడును లేచి విధివినయములు దోఁప
మాతృచరణాబ్జములకు నమస్కరించి,
'యాజ్ఞ యే'మంచు నిల్వ, నయ్యంబ యిట్లు
లనియె నెమ్మది నెంతయు హర్ష మెసఁగ:
క. "తనయా! యభ్యంజన మే
నొనరింపఁగఁ బోవుచుంటి; నొక్కింత జవ
మ్మునఁబోయి ద్వారరక్షణ
మును జేయుము; లోని కెవరిఁ బో విడువకుమా!"
చ. అనుడు 'మహాప్రసాద'మని
యాతఁడు ద్వారముసేర నేఁగుచో
ననిమిషభామలెల్ల బిడి
యమ్మెడలం గనుచూపుమేర దృ
గ్జనితమరీచికా నివహ
సంగతిఁ దన్పుచుఁ జూచుచుండి రా
తని నడతీరు, మైహొయలుఁ
దద్దయు నాత్మల సంతసింపుచున్.

ఉ. అంతటఁ బార్వతీసతియు
నయ్యెలనాగలఁ బిల్చి "యింక న
భ్యంతరసీమకుం జనుద
మా! సఖులార!" యటంచుఁ బల్కి, వా
రెంతయు వెన్కవెన్క నొక
యించుక చూచుచు "మజ్జనంబు సే
యింతుము, నీయనుజ్ఞఁ జరి
యింతుము, ర"మ్మన దేవదేవియున్.

తే-గీ. వారలన్ గూడి మజ్జనాగారమునకుఁ
జని యథేచ్ఛను స్నానంబు జరుపుచుండె;
బాలకుఁడు ద్వారరక్షణపరత నుండె;
నంత భక్తులఁ గనఁబోయినట్టి శివుఁడు—

సీ. ధ్యానాదిపూజావిధానమ్ములందున్న
భక్తుల కీప్సిత వరములొసఁగి,
సంసారమనిన నిస్సారమ్ముగా నెంచు
యోగిని ముక్తిసంయోగిఁ జేసి,
అఖిలమ్ముఁ ద్యజియించి యడవులఁ గ్రుమ్మరు
మునిరాజులకును దర్శనము నిచ్చి,
'పాహి మాం శంభో! కృపాసాగరా!' యంచు
నుతియించు దీను ననుగ్రహించి,

తే-గీ. తన కథల వ్రాసి జన్మ సార్థకముఁ జేసి
కొనఁగ యత్నించు కవుల నెమ్మనములందు
నిలిచి, ముద్దులుగులికెడు పలుకులిచ్చి
భక్తిమాత్రప్రధానసాధూక్తిఁ దనిపి.

సీ. కష్టమ్ములకునోర్చి కైవల్యమాసించు
 స్థిరహృదయమ్ములఁ జిత్తగించి,
యోర్మిఁ గోల్పోక మంత్రోపాసనా సాధ
 నాయత్తులగువారి నరసి మెచ్చి,
రుద్రాభిషేకాది భద్రకార్యస్ఫూర్తిఁ
 దనియించువారల దండ నిలిచి,
దేదీప్యమాన పాతివ్రత్య కాంతి వి
 స్తార సుందరుల యిష్టములఁ గూర్చి,
తే-గీ. విసివి వేసారి మరల నివేశమునకు
నేఁగి కాత్యాయనీవదనేందుమండ
లమ్ముఁ జూడంగ, రజతాచలమ్మునన్ వి
హారము లొనర్పఁ గోరిక లాత్మఁ గ్రమ్మె.
మ. చలియించున్ మనమందు;భక్తులకు ని
 ష్టమ్ము ల్దీరుక్తంబుగన్
వెలయించున్ ; వివిధానులాపముల నం
 దిం'బాబమ్మ! పా'మ్మంచు బి
ట్టలయించున్ గిరిజాసతీతిలక వ
 క్త్రాంభోజ సందర్శనో
త్కలికారంభ విజృంభమాణ హృద యనా
 త్కంఠ్యంబు దీపించుటన్.
శా. కాలుం గెల్వఁగవచ్చు ; నాకౌకయెడం
 గామారి కావచ్చు ; ని
ర్మూలింపంగనువచ్చు మృత్యువుఁ; బుర
 మ్ముల్ గాల్పఁగావచ్చు ; ధా

రాళజ్ఞానమయత్వ సంపదను స
ర్వజ్ఞుండుఁ గావచ్చుఁ; గాం
తా లోలాత్ముఁడె యైన నీశ్వరునకై
నన్ నిల్వఁగా శక్యమే?

వ. ఇట్లు పర్వతరాజపుత్త్రికా సందర్శనోత్సాహ సంభరిత హృదయుండై, త్వరితాంతఃకరణుం డగుట నందీశ్వర సరభసగమనాకంపిత భుజంగమ హారవల్లరులనైన సవరించుకొనక, నిర్దిష్ట ప్రదేశ పరిచ్యుత లీలావతంసంబును యథాస్థానంబునఁ దార్చికొనక, యాకర్ణికాంతర జటాభారంబుఁ జక్కఁ దిద్దుకొనక, వాహనోభయపార్శ్వంబులం దూఁగాడు పుండరీక చర్మోత్తరీయంబు సరకుగొనక యోగీశ్వరేశ్వర మనఃపశ్యతోహరుం డగు హరుండు—

తే-గీ. సత్వరంబున నందిని 'సాగు'మనుచు
నున్నతాద్రుల నదులను నుత్తరించి,
వాయువేగ మనోవేగ పక్కి రాజ
తాచలోపరిమందిరప్రాంతముననుం.

ఉ. నందిని డిగ్గి 'యెప్పుడు క
నంబడు గౌరి' యటంచు మాయలో
నం దవులొందినట్లు భవ
నమ్మును జేరఁగవచ్చి, గోముపై
నందలి సాలభంజికల,
నందలి కీరముఖాండజంబులన్
దందడిఁ బల్కరించుచును
ధ్యానము సర్వముఁ గోలుపోవుచున్.

ఉ. అజ్ఞుఁడువోలె సర్వభువ
    నావనకార్యపరుండు నాఁడు స
ర్వజ్ఞుఁడు మందిరమ్మున వి
    రామము లేక చరించి, యెందునన్
రాజ్ఞిని గానఁడయ్యెను; మ
    నమ్మలు కాంతలమీఁదఁ బోవుచోఁ
బ్రజ్ఞను గోలుపోని మగ
    వాఁడొకఁడేనియు నుండనేర్చునే?

శా. ఆరీతిం జరియించి, మందిరములో
    నందందు వీక్షించి, యె
వ్వారిం గానక, బుద్ధినిల్వమిని న
    వ్రాజ్ఞుండునుం బోలె దే
వారాధ్యుండు మెలంగి, తుట్టతుద బి
    ట్టాత్రమ్మునన్ మజ్జనా
గారప్రాంతముఁ జేరి, లో వెదుక నా
    కాంక్షించి పోఁబోవుచో.

చ. ఘలుఘలు మంచుఁ బాదకట
    కంబులు మ్రోఁగ, గళంబునందు హా
రలతిక లూఁగ, బాహుపురి
    రత్నమరీచులు దొప్పఁదోఁగఁ, గుం
తలములు ఫాలభాగమునఁ
    దద్దయు మూఁగ విలాసమూర్తినా
నలరెడు బాలకుండును ర
    యంబుగ నడ్డుగ నిల్చి యిట్లనున్:

శా. "జోగీ! యెవ్వరివాఁడ? వెందులకు ని
చ్చోఁ వచ్చుచున్నావు? లో
నేఁగంజూచెదె? యాఁగుమాఁగు, మిది నీ
యిల్లంచు లోనెంచితో?
బాగాయెన్! బలుకాడవేల? బధిర
త్వమ్మున్నదా? మూఁగవా?
సాగంబోయెదె తెల్పుచుండఁ? గమనో
త్సాహంబుఁ జాలింపుమా."

ఉ. ఆరహిఁ దెల్పినన్ నిలువ
నట్టి మహేశ్వరుఁగాంచి, "రాకు మీ
దారి నటంచు సాంత్వపు వి
ధమ్మునఁ దెల్ప నిరాకరించి లోఁ
జేరఁగఁ జూచెదే నదియు
చేటును దెచ్చు, నెఱుంగు" మంచుఁ ద
ద్వారముఁజేరి శాలకుఁ డు
దాగ్రహమూనసుఁ డౌచు నిట్లనున్:

క. "ఎవరిని లోనికి రానీ
యవలదు సుమ్మంచు నాకు నాజ్ఞయిడిరి; యీ
భవనముఁ జొరఁజూడక నీ
వవలకుఁ జనుమయ్య! బ్రదుక నాసించితివేన్"

క. అని పల్కెడు బాలకునిన్
గనుఁగొని, కోపంబుగదుర, గరళాహారుం
"డనిమిషదైత్యాదులకున్
నను నిల్పఁగ రా;దితండనఁగ నెవ్వఁడౌకో!

చ. తెలిసినయట్టు లుండియును
దెల్లము గా; దితఁడెవ్వఁడౌనొ? నా
బలము నెఱుంగఁడొకొ? గరు
వమ్మున, దాల్మియు నొప్పఁ బల్కెడిన్;
జలమున నెవ్వఁడైన నిటఁ
జంపన గోరఁగ నేల? వీనికిన్
దలకక పోదు; నడ్డునెడ
దాని ఫలం బనుభూతము య్యెడున్."

తే-గీ. అని నిరుత్తరుఁడై పోవు నభవునకును
నడ్డుగా నిల్చి, బాలుఁ డుదగ్రలీల
శస్త్రమును దూసి జళిపించి "సాహసంబు
మానవా యెంత చెప్పిన, మందబుద్ధి!

చ. మఱియొకసారి తెల్పెదను,
మానుము మానుము సాహసంబు; నె
వ్వారుఁ జన రాదు లోన;
బలవంతుఁడ నేనని పోవఁజూచినన్
గురుతర బాణజాలముల
కుఱ గుఱిసేసి త్రుటిఁ జయింతు; న
న్నెఱుఁగక పోయెదే ననుభ
వించెదు తత్ఫల మింతనింత నే."

చ. అనవుడు శంకరుం డను "దు
రాత్మక! బాలుఁడవంచు నూరకుం
డినఁ జలపట్టి యడ్డమయి
నిల్చెద వేల? త్రిశూలపాణి నై

న నను నెదుర్ప మూఁడు భువ
నమ్ముల వీరుఁడు లేఁడు; చాలు, నీ
యనుచితిఁ గట్టిపెట్టుకొని
యావనగర్వము వీడు మింతటన్."

మ. అనుడుం బాలకుఁ డాగ్రహంబున "మదాం
ధా! గర్వభూయిష్ఠ! శ
త్రునికాయాసువనీదవానల నిభ
క్రూరాస్త్ర శస్త్రాదులన్
గనుఁగొ; మ్మూరక మాటలాడకుము; బా
ణవ్రాత మొక్కింత ని
న్నెనయన్ వచ్చెడువేళ నెందరుగునో
యీ శౌలమున్ గీలమున్?

శా. బాలుం డీతఁడు, నేను బెద్దననుచున్
భావింపఁగాఁ బోకుమీ;
శౌలం బాపదయందుఁ దోడగు నటం
చున్ నమ్మఁగాఁబోకు; వా
చాలత్వమ్మున సాగఁబోకుము; మద
స్త్రవ్రాత లక్ష్యంబవై
ధూళిం బ్రుంగకు; బుద్ధిగల్గి మను సా
ధుత్వంబు దీపింపఁగన్."

వ. అని యనేకవిధంబులం బ్రతివచనంబు లొసంగుచు మార్గ మధ్యంబున నాలీఢవిశేషంబున నిలిచి శ్రవణపుటంబులదువ భీషణ ధనుష్టంకారంబుఁ గావించు నయ్యనన్యసామాన్య మూర్తి మత్స్వరూపం బెవ్వరిదని క్షణమాత్ర మాలోచింప

యత్నించియు,యవనికాభ్యంతర పాత్రంబులపగిది మోహ సంఛన్నంబులై, దివ్యదృష్టి సర్వజ్ఞతావిశేషంబులు స్ఫురింప కుండుటయు, దేవీ ముఖాంబుజము దక్క వేఱొండెద్దియుఁ గన్పట్ట కుండుటయుఁ గారణంబుగా నిరవధి కాగ్రహ గ్రహా కంపితశరీరుండై.

శా. కాలావేశ విరోధి, దైత్యజనతా
కాంతార దావాగ్ని, ని
ర్మూలీభూతపురత్రయమ్మ, జయ స
మ్మోదాస్పదం, బాశ్రిత
త్రైలోక్యాభయదమ్మ, దక్షమఖ బా
ధాకారణాస్త్రంబునౌ
శూలంబుఁ గరమందుఁ బట్టుకొని, యా
శుం డీసు లోఁగ్రమ్మఁగన్.

ఉ. అక్షులు కోపవహ్ని గురి
యన్, మొగ మెంతయు జేవురింప, నా
త్మ క్షమఁ బూర్తిగా విడిచి,
తామసభావము ప్రజ్వరిల్లఁగాఁ
"దక్షుణ మీతనిం దునిమి
దర్పమడంపు" మటంచుఁ బుచ్చె; నె
ప్పక్షమునందు నే స్వీకృత
భావము చూచు నె మంచి చెడ్డలన్ ?

శా. ఆరీతిన్ శివహస్తముక్తమయి ఘో
రాకార సంరంభ మే
పారన్ వచ్చుచునున్న శూలము మర
ల్పం గోరి యెన్నేనియున్
నారాచమ్ముల నేసె బాలుఁ; డవియుక
దచ్ఛూలు ఘోరానన
ద్వారంబందు విలీనమాచు ఫలమొం
దన్ లే దాకింతేనియున్.

వ. అటులా రౌద్రాస్త్రంబు తీవ్రపావకాభీలచ్ఛటాభీషణానన సముజ్జృంభితంబును, సమలంకృత కింకిణీరావ విరాజితంబును, శతసహస్ర సహస్రకిరణ ప్రకాశమాన దివ్య తేజోద్దీపితంబును నై, బాలకహస్తనిర్గత శరపరంపర లాహారంబుగాఁ గొనుచు నతిరయంబునం జనుదెంచి, యీశ్వరాజ్ఞా బలసంపన్నంబగుట నబ్బాలుని మస్తకం బొక్కమ్మడిఁ బొడిసేసె; నంత.

మ. అదరెం బార్వతి దక్షిణాంబకము; ది
వ్యాబ్జాయతాక్షీగణం
బెదలం దెల్పఁగరాని యార్తిఁగనె; న
య్యీశుండునున్ లోనఁ ద
ప్పిదముం జేసిన భంగి నెంచె; బయటన్
వీక్షించు భూతమ్ములా
త్మఁ దలంకెన్ ; భయకంపమొందెను దిశల్
తత్కార్య ఘోరాహతిన్.

శా. రుద్రుం డంతట బాలుఁ డీల్గఁ గని "హా!
క్రూరుల్ శివద్వేషు లీ
మాద్రిన్ శూలమువాఁత ద్రుగ్గెదరు; సౌ
మ్యద్వేష దోర్గర్వులున్
ఛిద్రంబందుదు రిట్లు" యంచును దలం
చెంగాని చేఁజేతఁ బు
త్రిద్రోహం బొనరించుకొంటినని లోఁ
దర్కింపఁ డుత్కోపియై.

శా. ఆరీతిన్ గిరిపుత్రికా వరసుత
వ్యాఘాతముం జేసి, దు
ర్వారుండై యభవుండు దివ్యభవన
ద్వారంబులన్ దాఁటి, క్రీ
డారామంబుల నుత్తరించి, యెద మో
హం బుబ్బఁగా లోనికిన్
రా, రామామణులెల్ల సిగ్గు మదిలో
నం గ్రమ్మ నొక్కుమ్మడిన్.

క. అటునిటు వాఱిరి; దేవియుఁ
దటుకున నభ్యంతరపు సదనముం జేరెన్;
జటులోత్కి నవ్వుకొనుచున్
నిటలాక్షుఁడు 'దేవి! నిలువు! నిలువు' మటంచున్.

చ. చనవునఁ బోవుచుండఁ గని,
శ్యామ "మహేశ్వర! దేవదేవి మ

జన మొనరించు వేళ నిటు
  సర్వమెఱింగిన మీరె రా మతే
మని వచియింపఁ జాలుదుము ?
  హైమవతీసతి లోని కేఁగె; మా
మనవిని జిత్తగించి క్షణ
  మాత్రము నిల్వుఁడు మీరు వాకిటన్."

క. అని శ్యామ పల్కినంత, వ
సనమున్ ధరియించి దేవి సరభస గమన
మ్మున వచ్చి, పతిచరణముల
కును మ్రొక్కె భయంబు, సిగ్గుఁ, గొంకుఁ గనఁబడన్.

వ. అట్లు మ్రొక్కి, శ్యామచే నంతలోఁ దేఁబడిన వస్త్రంబున శిరోజంబులం దడియార్చుకొనుచుఁ, బతినుద్దేశించి,

క. "వనితలయెడ నాథులకును
జన వెంతగ నున్న, నీశ! సతు లిట్లభ్యం
జన మొనరించెడు పట్టునఁ
బ్రణయంబున వచ్చి సిగ్గుపఱుతురె ? చెప్పుఁడా."

వ. అని యీషదుపాలంభనాయత్తచిత్తంబునం బల్కి, యాత్రంబున వెండియు నిట్లనియె:

ఉ. "ఈరహిఁ మీరు వచ్చునెడ
  నే మనఁజాలుదు? మెట్టులైన మీ
పూరుషవర్గమెల్లఁ బలు
  పోకలఁ బోవుచునుంద్రు; మీపయిన్

నేరము మోప నేమిటికి?
నిందితకార్యము కాదుగాని, యా
ద్వారముచెంత మిమ్మెవరు
నడ్డుటలేదె? యెఱుంగఁ బల్కుఁడీ!"

మ. అని యాత్రమ్మనఁ బల్క, దేవికిని బ్ర
జ్ఞాధిక్యముం దెల్పు లా
గున నీశుం డనె "నింతి! యయ్యదియ నీ
కున్ దెల్పఁగానుంటిఁ; దీ
రని క్రోధంబున నర్భకుండొకఁడు ద్వా
రంబందు నన్నాఁపఁ బో
యెను; వాఁడెవ్వఁడొ? నన్ను నాపుమని త
న్నెవ్వారు పంపించిరో?

ఉ. 'బాలుఁడు; తారతమ్యముల
బాగుగ లోనెఱుంగఁ; డింతకున్
జాలఁడు నా' కటంచు నెద
శాంతము నొందితిఁగాని తీవ్ర వా
చాలత, శస్త్రనైపుణియు,
సాహసమున్ గనుపర్పఁబోయి మ
చ్చాలముచేతఁ దుట్టతుద
శూరుల మార్గముఁ బట్టె నొక్కటన్."

శా. ఆపల్కుల్ విని దేవకన్నియలు హా
హా కారముల్ సేసి;'రి

స్నీ! పాపంబు శమించుఁగాక' యనుచున్
చేతంబు నొవ్వంగఁ జిం
తాపాథోనిధి మున్గె దేవి; భవుఁ డా
దైన్యంబు వీక్షించి ని
ర్వ్యాపారుండయి నిల్చి, లోన 'నిది యే'
మంచున్ విచారించుచున్.

తే-గీ. చిత్త మేకాగ్రతను నిల్పి, చేసినట్టి
యనుచిత మెఱింగి, పార్వతి ననునయింపఁ
జెంతకును బోవ, నవ్వాలవంతకతన
నామెయును మూర్ఛలో మున్గినట్లు వడియె.

మ. తరుణీరత్నము మూర్ఛలో మునిఁగెఁ; జెం
తన్ దేవకన్యల్ పర
స్పరముం జూచుచు నిల్చి; రీశ్వరుఁడు దా
సర్వజ్ఞతా వైభవ
స్ఫురణన్ బాలుని జన్మముం దెలిసి, త
ప్పున్ లోన వీక్షించి, యే
వెరవున్ దోఁపనివాని భంగి బయలన్
వీక్షించుచున్ నిల్వఁగాన్.

మ. భవబంధంబులఁ బాపి, భక్తులకుఁ గై
వల్యంబుఁ దానిచ్చి సం
స్తవముం జెందెడి లోకమాతయును సం
సారంబుఁ, బుత్త్రిండు లో

సవు బంధంబులఁ జిక్కుకొన్నగతి న
త్యంతంబుఁ జూపట్టె యా
త్మవిచారంబున నేడ్చెనంట బహుధా
దైన్యంబు గన్పట్టఁగన్.

ఉ. "నాథ! భవద్విలాసము ల
నంతములంచును బంచభూతముల్,
వేధయు, నష్టదిక్పతులు,
విశ్వము నిచ్చలు నిన్నుఁగూర్చి యా
రాధనముం బొనర్తురు; ప
రాకున మీరలె మీ తనూజునిన్
బాధితుఁ జేయఁ గా దనెడు
ప్రాజ్ఞుఁడు వేఱ యొకండు గల్గునే?

శా. సర్వజ్ఞుండు పరాత్పరుండు మహిత
స్వాంతుండు సర్వంబునన్
దుర్వారుండును విశ్వనాథుఁడును నా
థుండంచు లో నెంచుచుఁ
గర్వంబందుచు నుందు నా తలఁపు భం
గంబొంద నేఁడిట్లు నీ
సర్వజ్ఞత్వముఁ గోలుపోయితివె? నీ
చందంబు లీపాటివే?

ఉ. వ్యగ్రత రాదె యీశ్వరుని
వంటి మహాత్ముఁడు, సర్వవేది, దే
వాగ్రణియై సదా కరత
లామలకమ్ముగఁ జూచి లోకముల్
జాగ్ర దుదారసత్త్వమున
సాకఁగఁ జాలెడువాఁడు బుద్ధి సే
కాగ్రత నిల్పలేక తన
యప్రతికూలముఁ జేసెనన్నచో?

శా. సామోపాయము మాని, భీషణ ధను
ష్టంకార మేపార, సం
గ్రామారంభ కుతూహలమ్మ దనివా
రన్ దారతమ్యంబులే
కే మార్కొంటకు బాలుఁ డాతఁ డెదలో
నిచ్ఛించెడుంగాక, యు
ద్దామస్ఫూర్తిని నీ వెదుర్కొనుట చో
ద్యంబయ్యె నప్పట్టునన్.

ఉ. చిక్కినఁ బాలుగారు నును
జెక్కులు, ముద్దులు మూటఁగట్టుచున్
మక్కువఁ బెంచు మోము, సుకు
మారతరాంగకరాజి, చేరలన్
జిక్కని కన్నుదోయి గల
చిన్నికుమారుని డాఁకి చంపఁగా

నక్కటా! మీఁకుఁ జేతు లెటు
లాడెనో యీశ్వర! వింత యయ్యోదుగ!"

వ. అని, దీనవదనయై, నిజతనూజుం దలంచి, మానసంబునం గ్రమ్మి శోకవేగంబున నద్దేవి యిట్లు పలవింపం దొడంగె:

సీ. "పిండియుఁ బసపు నొప్పిదముగా జతకూర్చి
చెలువారు బొమ్మగాఁ జేయ నేల?
చేసితిఁబో, దాని 'జీవయుక్తముఁ జేయు'
మని బ్రహ్మ చెంతకు ననుప నేల?
అంపితిఁబో, యాతఁ డాదరాయత్తుఁడై
యెలమి దానికిఁ బ్రాణ మీయ నేల?
ఇచ్చెనుబో, ముద్దు ముచ్చటలను మాని
ద్వారరక్షణమునంచుఁ బంప నేల?

తే-గీ. పంపుచుండిన వేళ 'నీశ్వరుఁడు వచ్చె
నేని నెదురాడకుమ' యంచు నించుకంత
పలుక నేల? త్రిశూల ధారలకు నిన్నుఁ
జేతులారఁగ నప్పగించితినె కట్ట!

శా. ఆ లావణ్యము నించు మోము, సుషమా
యత్త స్ఫుర న్నేత్రముల్,
శ్రీలొప్పారెడు మేను, ముంగురులచే
శృంగారితం బైన యా

ఫాలంబున్, సకలాంగకంబులును
బాప క్రుద్ధ శూలాహతిన్
గూలంగా సృజియించినానె? యకటా!
కుత్రా! కుమారోత్తమా!

శా. ప్రావీణ్యంబున సృష్టిసేయునెడ నే
భావింప నొక్కింతయున్;
జీవంబిచ్చెడు వేళ ధాతయు నిటుల్
సెప్పండు; తద్ద్వారమున్
గావం బంచెడు వేళ నా స్ఫురణకుఁ
గన్పట్ట దీమాట; పు
త్త్రా! వెయ్యేల? సృజించి మృత్యువున కి
ట్లర్పించితిన్ నే నినున్.

క. ఇంతకు నీ జనకుఁడు ధీ
మంతుఁడు, సర్వజ్ఞుఁ డనుచు మతినెంచుటె నీ
యంతమును దెచ్చిపెట్టెను;
జింతించిన లాభమేమి చేకురు? తండ్రీ!

చ. తెలియనివాఁడుగాఁ, డొకటఁ దీవ్రతఁ
జెందెడువాఁడు గాఁడు; దు
ష్టులయెడ నేనియుం గరుణఁ
జూపు మహాత్ముఁడు నేఁడు నిన్నుఁ దా

నలఁచుట నా యభాగ్యతనొ,
యాయువు నీకును నల్పమాటనో
కలిగె; నిఁకేమి సేయుదును?
గాఁగల కార్యము తప్ప దేరికిన్."

వ. అని యనేక భంగుల విలపించి, పునర్మూర్ఛాబాధిత తనూవల్లికయై, పాదంబుల చెంతఁ బడియున్న శర్వాణి నెత్తియీశ్వరుం డిట్లనియె:

శా. చాలం గ్రుమ్మరి, భక్తవర్గమున కి
ష్ట వ్రాతము ల్దీర్చి, నే
భూలోకంబును వీడువేళ నెటులో
బోధమ్ము సర్వమ్ము మా
యాలోలత్వమునొందె; హేతువు దురూ
హంబయ్యెఁ; గాకున్న నో
బాలా! పుత్త్రి నెటింగి కౌఁగిటను జే
ర్పన్ లేనె ముద్దాడుచున్?

క. నినుఁ జూచు వేడ్క మనమున
జనియించినదాది మోహ సంభరితుఁడనై
కనుఁగొననైతి నిఁకెద్దియు;
వనితా! యా మాయ యింత వంచన సేసెన్.

ఉ. కారణమేమొ నే నెఱుఁగఁ
గాని, నిదానము మీఱ 'నెవ్వఁ డీ
శూరుఁడు? ద్వారమం దిటులు
చొప్పడి నన్నదలించు నేల? నా

వారికి నడ్డునిల్చు బల
దర్పము లెవ్వనికున్న' వంచు నా'
నేరుపుఁ జూపి పోల్చుకొన
నేర; నదేమి విచిత్రమో సుమీ!

మ. అకలంకమ్మగు ముందటన్ నిలిచి, బా
ణౌఘంబు వర్షింపుచున్
సుకుమారుం డతఁ డేఁగుఁదేర, 'నెవఁడో
శూరుండు దోర్గర్వముం
బ్రకటింపంగను వచ్చె' నన్నతలఁ పా
త్మన్ గ్రమ్మెనేకాని యా
సుకుమారుండు కుమారుఁడంచు మదిలో
సూచింప దొక్కింతయున్."

వ. అని ప్రకటీకృత స్వయంకృతాపరాధుండై చెంతన నిలిచిన సర్వమయు, సర్వేశ్వరు, సర్వజ్ఞు విలోకించి, "దేవా! దేవర వికల్పప్రజ్ఞులరగుట విచారణీయము; సర్వజ్ఞతావిభవంబు గోల్పోవుట శోచనీయము; దివ్యదృష్టిబలనష్టంబునకుఁ గతంబు దురూహంబు. ఇంతకును నీయందలి విశ్వాసంబునం జేసి సుకుమారుండగు కుమారుఁడు నేలపాలు గావలసి వచ్చె. కాదేని మీ మూర్తిత్రయం బొకట నెత్తివచ్చినను నిరాతంక బలవిశేషంబున జయింపఁగల సామర్థ్యంబు నేన యబ్బాలునకు సమకూర్చియుండనే? పొరపడి వగచినం బ్రయోజనంబేమి?" అని యాత్రంబునం జేసి స్వప్రభావంబు బయల్పఱిచియు, మరల నే మెఱుంగ

యట్లు నటించుచు బిట్టువాపోవుచున్న యపర్ణాదేవిం జూచి
శ్యామ యిట్లనియె:

శా. "దక్షబ్రహ్మ తనూజ! నీ కిటులు ఖే
దం బొందఁగా నేల? త
ద్రక్షార్థం బెదఁ గొల్వఁగాఁ దగదె మా
ర్కండేయ సంరక్షకున్,
సాక్షా ద్దైవశిఖామణిన్, గుణఖనిన్,
హాలీకృతోద్యత్ఫణిన్,
దక్షానల్ప కృపాతరంగుని, సుధా
ధామార్ధ చూడామణిన్?

శా. దేవీ! సర్వము నీవెఱుంగుదు; జగ
ద్విఖ్యాత కారుణ్య దీ
క్షావిక్రాంతి నెసంగు నీశ్వరు పదా
బ్జాతంబులన్ వ్రాలి వా
పోవం గారణమేమి? యా ప్రభువు నే
పూజించి, 'నూనుం జిరం
జీవిం జేయుమ!' యంచు వేఁడఁ దగదే?
సిద్ధింప వే యిష్టముల్?

తే-గీ. తల్లియును, దండ్రియును, దాత, దైవ మగుచు
భక్తగణములఁ బ్రోచెడు పరమమూర్తి
నీ మనోభీష్టమును దీర్ప నేరఁడఁటవె?
పుత్త్రభిక్షార్థ మతనిని మ్రొక్కుకొనుము."

వ. అని సాధనోపాయంబు సువ్యక్తమధుర భాషణంబుల నీగతి శ్యామ బోధింపఁ, గలఁకఁ దేరి, యద్దేవి దీనాననయై, పతి నుద్దేశించి యిట్లనియె:

మ. " 'అభవుం డీశ్వరుఁ డార్తరక్షణుఁడు పూ
ర్ణాయుష్కుఁ గావించి నా
కభయం బీయఁడె ? కాలుఁ డెంత?' యని ని
న్నర్చించి మృత్యూద్ధతిక్
రభసస్ఫూర్తి జయించెనంట మును మా
ర్కండేయుఁ; డామృత్యు వీ
సుభగుక్ నీసుతుఁ దాఁక మాన్పఁదగదే?
శోకంబు వారింపవే ?

ఉ. ప్రాకృతరీతి నీవును బరాకున మోహిత చిత్తవృత్తి దే
వా! కరుణావిహీన మగునట్టి పనిం బచరించినాఁడ; వీ
శోకము నాఁపఁజాల; వరసూనుని వేగ సజీవుఁ జేయవే!
నీకు నసాధ్యమేది?కరుణించి వరంబిడు;భక్తి మ్రొక్కెదన్."

వ. అని తనివోని చిత్తంబుతో నప్పరమపతివ్రతాతిలకం బింకను భక్తిచే నాథునిఁ బ్రసన్నుఁ జేసికొన నెంచి, తత్పాదంబుల వ్రాలి.

శా."కర్తృత్వంబున బ్రహ్మ, సర్వహిత ర
క్షాముద్ర విష్ణుండు, సం
హర్తృత్వంబున నీశ్వరుం డన సమ
స్తాధార మూర్తిత్రయ

స్ఫూర్తిఁ లోకము లేలు సద్గుణ విలా
సున్, యోగిహృద్వాసు, దీ
నార్తత్రాణ పరాయణుం గొలుతు ని
ష్టార్థంబు సిద్ధింపఁగన్.

శా. నానాసృష్టి విచిత్ర వస్తువులలో
నం బంచభూతమ్ములన్
జ్ఞానాత్మమ్ములఁ దోఁచి, భక్తులకు న
జ్ఞానాంధకారంబు నెం
తేనిన్ మాపుచు, సర్వదా సులభుఁడై
యేపారు యోగీశ్వర
ధ్యానాంతర్గతమూర్తిఁ గొల్చెదను బు
ద్ధిత్రాణవాంఛారతిన్.

మ. జలరాశిన్ జనియించి, దుష్ప్రకటిత
జ్వాలాకరాళాస్య సం
చలితాండాండమయప్రపంచమయి, స్వ
చ్ఛందప్రభావ్యాప్తిమైఁ
బ్రళయంబో యన వచ్చు హాలహాలమున్
భక్షించి, దేవాళికిన్
దలఁకున్ మాన్చిన మూర్తిఁ గొల్చెదను బు
ద్ధిత్రాణ వాంఛారతిన్.

మ. మునిరాడ్ధ్యానములందు, సత్యపరతన్,
బూర్వాగమశ్రేణి, స
జ్జన చిత్తమ్ములలోఁ, బతివ్రతల యా
త్మన్, సత్కవిశ్రేష్ఠ ప
ద్యనికాయంబులఁ గొల్వుదీర్చు నభవుం,
ద్త్రైలోక్యసంరక్షకున్,
బ్రణవాధారు, ననంతునిం గొలుతుఁ బు
త్త్రిత్రాణ వాంఛారతిన్.

శా. అండాండంబుల నిండి, కార్యకరణీ
యాధార రాజత్కృపా
గండూషీకృత వేదశాస్త్రచయుఁడై,
కల్యాణ రూపప్రభా
వుండై సర్వము నేలుచుండెడు జగ
త్పూజ్యున్, నిరాలంబు, మా
ర్కండేయావను, నీశ్వరుం గొలుతుఁ బు
త్త్రిత్రాణవాంఛారతిన్."

మ. అని కాత్యాయని భక్తిపూర్వకముగా
హస్తాబ్జము ల్మోడ్చి ని
ల్చిన, నీశుం డనురాగసంభరితుఁడై
చేరంగ విచ్చేసి, "మో

హానిబడ్డసిత్థి నుంటఁజేసి కరణీ
యజ్ఞానవైకల్యమి
ల్లైనసెన్ నన్ను; క్షమింపు; శోకమునకున్
హేత్వర్థ మిందున్నదే ?

ఉ. నెమ్మదిఁ గోపమొందకుము; నేర్చియె నేరకొ చేసినట్టి దో
షమ్మునకుం బ్రతిక్రియ స్వశక్తిమెయిం బచరించి నీ విషా
దమ్మును మాన్పవాఁడ నొకదారిని;నాథుఁడు తప్పు సేసినన్
గొమ్మ!క్షమింపఁగాఁదగును గూరిమిగల్గిన యట్టి కాంతకున్.

ఉ. మానసపుత్త్రిఁడంచు నభి
మానము నీ విటు పూనియుండ నా
సూనుఁడు గాఁడె యాతఁడు? త్రి
శుద్ధిగ నమ్మెము; శోక మింతకున్
మానిని! నీకు నాకును స
మానమె సుమ్మి! తపింపనేల ? య
జ్ఞానము వీడుమా"యనుచు
సమ్మతి నామెను జేరఁదీయుచున్.

మ. "ఇదె రప్పించెద బ్రహ్మ నిక్కడకు; నీ
యిష్టమ్ము సేకూర్చెదన్;
ముదముం జెందుమ"యంచు లోఁ గనకగ
ర్భున్ సృష్టికార్యావనా

స్పదు నెక్కొల్పి, తదేకచిత్తమున ని
ల్వన్, భారతీకాంతుఁ డా
సదనంబందునఁ దోఁచెఁ దక్షుణము భా
షాభామినీయుక్తుఁడై.

క. వనజాసనుండు, భారతి
చను దేరఁగ శంకరుండు, శర్వాణియుఁ బూ
జనములు గావించి యటన్
దనరిన వృత్తాంతము విదితము సేయంగన్.

ఉ. ధాత వచించె "దీనికి నె
దన్ దలఁకం బని యేమి? మీ యను
జ్ఞాతిశయమ్ము గల్గ నిమి
షార్ధములోఁ బనిఁబూని మీ తనూ
జాతు సజీవుఁ జేసెదను;
సాయము నీ కొనరించుకం టె దే
వా! తగు కార్య మెయ్యది ? య
నంత! మహాత్మ! శివభాసమంచితా!"

వ. అని యనేక విధంబుల నొండొరుల ప్రభావంబులు నిరూ పించుకొనుచు నమ్మూర్తిద్వయంబు సముచిత ప్రియభాషల ద్వారంబు చెంతకు నడువఁ, దచ్ఛాయామాత్రలగు భారతీ పార్వతులును వారివెంట నంటి పోయి; రట్టియెడ,

క. ఆలోకించిరి వారలు
శూలనికృత్తోత్తమాంగ శోణితధారా

భీలాకారము, దుర్జయ
కాలాశుగనిహత బాలకశరీరమ్మున్.

ఉ. అంతటఁ బార్వతీరమణి
యా సుకుమారుఁ గుమారుఁ జూచి, దు
ర్దాంతవిచారమగ్న యయి,
ప్రాకృతభామినివోలె "పుత్త్రి! ప్రా
ణాంతకమైన శూలము దు
రాసదమై చనుదెంచు వేళ న
న్నెంత దలంచితో" యనుచు
నేడ్చెఁ గలస్వనలీనకంఠయై.

గీ. గౌరి కలకంఠనిక్వాణ క్వణితకంఠ
యగుచు నేడ్వంగ భారతి యనియె, "శోక
మేల? మానుము; పుత్త్రికిఁ డింతలోన
బ్రతుకనుండంగ నీకు నేడ్వఁ బనియేమి?"

వ. ఇట్లు భారతీదేవి యనునయింప దాక్షాయణి కలంకఁ దేరె; నంతఁ బితామహుండును బాలకశరీరంబుం బరీక్షించి, యీశ్వరునితో నిట్లనియె:

క. "నుఱుమై పోయెను దల; యె
క్కరణిని గూర్పంగనగును స్కంధంబున? దే
వరహాస్య మొకటి గల; ది
త్తరుణంబున దీనికిఁ విధానము వినుఁడీ!

క. ఉత్తర దిక్కు మొగంబై
మత్తత నిద్రించు జీవి మస్తకము వే
తెత్తురయేనిన్ దీనికి
హత్తింపన్ వలనుపడు; నుపాయం బిదియే."

క. అనవుడు నానాదిక్కుల
కును శంకరుఁ డాత్మసేవకుల నంపి, మన
మ్మునఁ గల పుత్త్రిప్రేమన్
జనియెం దా నొక్క దెసకు సరభసగతిమై.

క. చని చని శంకరుఁ డొకట వి
పినమున నుత్తరముఖమ్ము వెలయఁగ నిద్రన్
దను వెఱుఁగకున్న దంతిం
గని, కరశూలమున దాని కంఠముఁ దునిమెన్.

వ. అట్లు దంతావళమస్తకం బాత్రంబునఁ దునుము నవసరంబున, దాని దంత మొక్కటి ప్రమాదవశంబునం దెగి పడియెఁ; గాని పుత్త్రివాత్సల్యత్వరితాంతఃకరణుండగు నీశుం డద్దాని గణింపఁడయ్యెఁ; పుత్త్రిశోకాతురులు తజ్జీవనోపాయసంబంధి కార్యంబుల మెలంగు వేళ నంధీభూత లోచనులగుటయుందు వింతగలదే? అట్లు శంభుండు శోణితధారాసిక్తంబును, నేకదంతధావళ్యవిరాజితంబును, లంబమానకర్ణసమంచితంబును నగు దంతావళమస్తకం బతిజవంబునం గొంపోయి విధాతృకరంబున నిడ, నాతండును జిరకాల పరిచిత సృష్టికార్య చాతుర్యబోధిత

రహస్యుండు గావున ననాయాసంబుగా నమ్మస్తకంబు స్కంధంబునకుఁ దవిలించి, కమండలూదకంబు సమంత్రకంబుగా నభిషేకింప.

మ. సహజస్ఫూర్తిని దంతిమస్తకము తత్
స్కంధంబునం దోఁచె; దు
స్సహతేజమ్ము శరీరమందుఁ గదిసెన్;
శ్వాసంబు వచ్చెన్; మహో
మహుఁడై బాలుఁడు గన్నువిప్పి కనె నం
బన్ లేఁత నవ్వొప్పఁగా;
ద్రుహిణుం డాతని కేకదంతుఁ డని పే
రుం బెట్టె నుత్సాహియై.

చ. ప్రియము సెలంగ నట్లు గను
విప్పిన బాలకు నెత్తి, పుత్త్రమో
హాయుతమనస్కయై, యుబుసు
లాడుచుఁ గౌఁగిటఁ జేరఁదీసి, హ
స్తయుగళిఁ గంఠసీమకును
దార్చుచు ముద్దిడి, వేడ్క నప్పు డ
వ్యయ సుగుణాలవాల జగ
దంబిక లాలనసేసె బాలునిన్.

ఉ. మక్కువ ముద్దులాడు నిజ
మాతకు మ్రొక్కి, ముదంబు మీఱ నా
ప్రక్కనె చూచుచుండిన క
పర్దిని గన్గొని బాలుఁ "డోఁతి! నీ

వికడ నుంటె ? యీపయి నిఁ
కెచ్చటి కేఁగెద"వంచు బాణముల్
గ్రక్కునఁ జేతఁబట్టుకొన,
గౌరియు నడ్డమునిల్చి యిట్లనున్ :

ఉ. "పుత్త్రిక ! పూర్వమత్సరము
పూర్తిగ వీడు; మతండు దివ్యచా
రిత్రుఁ డనంతుఁ డాశ్రితవ
రేణ్యశరణ్యుఁడు పుణ్యమూర్తి మూ
ర్తిత్రయ సుస్వరూపుఁ డుర
రీకృత సర్వజగత్ప్రభుత్వుఁ; డీ
యాత్రము మాని మ్రొక్కి కను;
మాతఁడె నీజనకుండునుంజుమీ !"

క. అని తల్లి పలికినంతన
కనులను నానందబాష్పకణములు దొరుఁగన్
జని బాలుం "డపరాధిని;
జనకా! దయఁజూడు" మనుచు సాగిలి మ్రొక్కన్.

ఉ. భావము పల్లవింప సుతవత్సలుఁ డాయుభవుం డనున్ "జిరం
జీవివి గమ్మ పుత్త్రి! పరిశీలనఁజేయఁగ దోస మిందునన్
నీవలనం గనంబడదు; నిశ్చయ మేనె పరాకుఁజెందితిన్;
గావున నింత మూఁడె"నని కౌఁగిట నాతనిఁబట్టి ముద్దిడెన్.

తే-గీ. మారునిం గెల్వఁగావచ్చు, మై విభూతి
నలమికొనవచ్చు, నుగ్రుఁడై మెలఁగవచ్చుఁ;

గాని యీ మూఁడుకన్నులవానికైన
తనయుఁ డగుపడ మోహంబు దాఁటరాదు!

వ. అటు లామహేశ్వరుం డాత్మజు నెత్తి ముద్దాడి యానం దించుచు, సర్వసృష్టి విచిత్రసంఘటనానిదానైకశీలియగు తమ్మిచూలిం దిలకించి, "దేవా! నాయాత్మం గల సందియంబు నివారింప నీవే సమర్థుండవు. నేను లోకంబులఁ బ్రత్యక్షంబుగాఁ జూడఁ బయనమై యేఁగి మరలి యరు దెంచు నెడ నామనం బేకాగ్రత నిల్వకుండుటకును, బోధమ్ము వికల మ్మగుటకును, బుత్త్రుం దెలియక శూలంబునఁ దెగవేయునంతటి యజ్ఞానంబు గలుగుటకును గారణంబు నిరూపింపవే"యన నమ్మాటలకు నవ్వుచు విధాత యిట్లనియె:

సీ. "సృష్టి స్థితిలయమ్ము లొనయించి లోకము
లనయమ్ముఁ బాలించు నాదిమూర్తి,
సచరాచరాఖిలజగములందున నిండి
సర్వముం బ్రేమించు సౌమ్యమూర్తి,
ముక్తిబింబాధరాసక్తయోగీశ్వరే
శ్వరచిత్తవాస సర్వజ్ఞమూర్తి,
ఓంకారయుక్త మంత్రోపాసన పరాయ
ణాస్తవనీయ ప్రశస్తమూర్తి,

తే.గీ. సచ్చిదానందమూర్తి, భాస్కరసహస్ర
మహిత తేజోవిరాజితామ్నాయమూర్తి,

ఆర్తిహరణపరాత్పరమూర్తి! నీకు
నెఱుఁగఁబడని రహస్యంబు లెందుఁ గలవు?

శా. ఐనం దీనికిఁ గారణం బడిగినా, వప్డాటఁ బ్రత్యుత్తరం
బే నీయన్వలెఁ గానఁ దెల్పెదను; నీ వీరేడు లోకమ్ములన్
గానంబోవక మున్ను గొల్వున నిదానం బార నీదేవి, 'దే
వా! నీ వెప్పుడుగానియున్ వికలిత ప్రజ్ఞుండవై యుండవే?'

క. అని యడుగ మీరు సెల వి
చ్చినమాటలు జ్ఞప్తియున్నె? చిత్తమ్మున ని
వ్వనజాయతాక్షి వానిన్
గొనకొని తర్కింపసాగెఁ గోటి విధములన్.

శా. 'ప్రజ్ఞాదోషము వచ్చునే' యనుచు నేఁ
బ్రశ్నింపఁగా నేల? స
ర్వజ్ఞం డాతఁ'డటంచు లోఁదలఁచు; 'ని
ర్వ్యాజంబు గా, దిందుఁ గా
లజ్ఞాతవ్య విశేష ముండు' ననుచున్
లక్షించు; నెంతే. భవ
త్ప్రజ్ఞాదుల్ గణియించు; నీముఖ మెదన్
భావించు లో మ్రొక్కుచున్.

ఉ. కారణ మట్టులుంటఁ దమ
కంబున దేవర పర్వతాత్మజా
కారముఁ జూడనెంచి మమ
కారముతో నరుదెంచి తావకా

గారము లెల్ల నారయుట
గల్గెను; చిత్తము మోహమగ్నమై
వాటెడునాఁడు యుక్తము నె
వండొనరింపఁగఁజాలు నీశ్వరా!

చ. అదియునుగాక లోనెఱిఁగి
యైన నెఱుంగకయైన నీశ్వరున్
గదిసి యదల్చువారి కప
కారమొనర్పఁగ శూల మెప్పుడున్
బదనుగ నుండు; నీశ్వరుని
పట్టున దోష మొనర్చువారికిన్
విదితవిధీ! ఫలం బనుభ
వింపక తీరునె యెన్నఁడేనియున్?

శా. వైషమ్యంబగు కార్యజాలములచే
వంశంబు చేటొందు; ని
శ్శేషంబౌ స్వబలంబు; నాయువు సెడున్;
శ్రీభోగభాగ్యాదులున్
శోషిల్లున్; బరమాప్త మిత్రగణమున్
దూరంబె యౌ; నీశ్వర
ద్వేషోద్భూత ఫలంబుఁ దెల్పఁ దరమే?
విశ్వేశ! వెయ్యేటికిన్?

ఉ. కావున బాలకుం డతను
గర్వవిజృంభిత మూర్తియై, మహా
దేవుఁ బరాత్పరున్ నిను మ
దిన్ దలపోయక వైరమూనుటన్
శైవమహాస్త్రశక్తి మర
ణంబును జెందె; నగాత్మజా కృపా
భావము, నీయనుగ్రహముఁ
బర్వుట జీవము నందెఁ గ్రమ్మఱన్."

వ. అని విధాత బాలుండు విఘ్నంబొందిన కారణంబు నివే
దింప, దేవియు నద్దాని కించుకంత కారణభూత నైతి నని
తలంచి యూరకుండెఁ; బదంపడి యబ్బాలుని ముద్దాడుచు
నప్పార్వతీపరమేశ్వరు లానందాబ్ధి నోలలాడుచుండి" రని
సూతుండు మునీశ్వరులకు వినిపింప, వారును సంతుష్టాంతః
కరణులై, "యనఘా! బాలకునకు విఘ్నాధిపత్యంబును,
విద్యానాథత్వంబును లోనుగాఁగల ప్రభావంబు లెట్టు
లలవడియె? కార్యారంభసమయంబుల నెల్లవారును
నమ్మహాత్ముఁ బ్రథమంబునఁ బూజించుటకుం గతం
బెయ్యది? భాద్రపదశుద్ధచతుర్థీ దివసప్రభావం బెట్టిది?
వక్కాణింపవే" యన.

# 3

తే-గీ. అవధరింపుఁడు శౌనకుం డాదిమునులు
విన నపేక్షించు నంశమ్ము వేడ్కఁ నిట్లు
దెలుపసాగెను సూతుండు దివ్యభక్తి
రస సమంచితవాక్సుధారసమువాఱ.

శా. "ఈవృత్తాంతము సర్వముం దెలిసి దే
వేంద్రాది దిక్పాలకుల్,
శ్రీవిష్ణుండును, లక్ష్మి, నారదుఁడు, ప
క్షి శ్రేష్ఠుఁడున్ లోనుగా
దేవౌఘుంబులు తత్ప్రదేశమున క
ర్థిన్ వచ్చి రయ్యీశ్వరున్,
దేవిం, దత్సుతుఁ జూచు కోర్కెఁ యెదలన్
జెన్నార నొక్కుమ్మడిన్.

వ. అటులు విచ్చేసినవారి నెల్ల నుచితరీతి గారవించి, యా సతీసర్వేశ్వరులు పుత్త్రి నందఱకు వేర్వేఱఁ గానుపించి, నాఁడు మహానందభరిత హృదయులై యుండిరి. అంతఁ బర్వతరాజ పుత్త్రికామణియు హృదయంబునఁ బొంగి పొరలు సుతవాత్సల్యంబునం జేసి యాతని మహా ప్రభావ సంపన్నుం జేయ నిశ్చయించి, యాతని నొడిలో నిడుకొని, వరదానకార్యకౌతూహలాయత్తచిత్తయై ఇట్లు వచించె:

తే-గీ. "భాద్ర పదమాసమున శుక్ల పక్షమందుఁ
జవితి నాఁ డీవు వెలసితి; వవుట, నేఁడు

మొదలు ప్రతివర్ష మీ దినమ్మునను నీకుం
బరగుఁ గావుత వర్ధంతి తిరముగాను.

ఉ. ఈ దినమందు నీజగ మ
నేకవిధంబులఁ దావకీన జ
న్మాదులఁ బ్రస్తుతించుచు, గృ
హాంగణభూము లలంకరించి, నీ
పాదములన్ భజించి, బహు
భక్ష్య నివేదనముం బొనర్చి స
మ్మోదమునందుఁగావుత; మ
మోఘువరం బిది, వత్స! నేఁడుగాన్.

క. ఈనాఁ డెవ్వఁడు నిన్నున్
మానసమునఁ గొల్చునో కుమార! యతఁడె బ్ర
హ్మానందైక విలాస
స్థానమ్మైన నిత్యభోగ సంపూర్ణుఁ డగున్.

సీ. బ్రహ్మచారులు నిన్ను భావించి సేవించి
అఖిల కల్యాణమ్ము లందఁగలరు;
కన్యలు నిను భక్తిఁ గైసేసి యర్చించి
భూరి సౌభాగ్యముల్ వొందఁగలరు;
వరగృహస్థులు నిన్ను భజియించి తతపుత్త్ర
పౌత్త్రాభివృద్ధిని బడయఁగలరు;
తత్త్వజ్ఞు లెదల నిన్ ధ్యానించి పూజించి
కైవల్య సంప్రాప్తిఁ గాంచఁగలరు;

తే-గీ. పలు పలుకు లేల? వినుము నా భాగ్యరాశి!
చిత్తవృత్తిని నిన్ సదా సేవచేసి,
యైహికంబైన నాముష్మికార్థమైనఁ
బడయఁ గలుగుదు రిలను నీ భక్తిపరులు.

క. మాదరి నందని కోర్కుల
నీదరి నందుదురు జనులు; నిశ్చయ మిది; "పు
త్త్రాి దిచ్ఛ దపజయ" మని
మోదము నందుదుము మేము ముద్దుల పట్టీ!

మ. తృణమున్ మేరువుగాఁ దలంచుము; నతా
ర్థివ్రాత వాక్యమ్ములన్
బ్రణయంబుంచుము; భక్తవర్యులఁ గృపా
పారంగతస్ఫూర్తి ర
క్షణముం జేయుము; సేవ యల్పమయినన్
స్వాధీనమైయుండి స
ద్గణముంబ్రోవుము; కీర్తినందుము దిశా
కాశావకాశంబులన్."

క. అని యనురాగము వెలయఁగ
జనని జగద్ధితవరములఁ జాలఁగ నిడి సూ
నుని గొని చని శివునంకము
నను నిల్పెను బుత్త్రిమోహానందిత యగుచున్.

ఉ. అంకమునందు నిల్చి వృష
భాంకుని కంఠ కపాలమాలికల్
గొంకుచుఁదాఁకి తుండమున
కుం దవిలించుచుఁ దద్భుజంగ మా

లంకృతులన్ విలాసముగ
లాగుచు నవ్వెడు పుత్త్రిఁజూచి యే
ణాంకకళావతంసుఁ డధి
కాదరబద్ధ హృదంబుజాతుఁడై.

ఉ. "మాతృ వరప్రభావ మన
మానునిగా నొనరించె నిన్ను జై
వాతృక ! భక్తవర్గ పరి
పాలన మేమఱకుండు; మస్మ దీ
యాతతవైభవంబు రజ
తాచలమున్ మనసార నేలు మీ
భూతగణార్ధి సంఘముల
మ్రొక్కులు గొంచు ననంతమూర్తివై.

చ. సమతఁ జరించి భక్తుల క
సాధ్యవరమ్ముల నైన నిమ్ము; లో
కములను నడ్డులే కఖిల
కారణమూర్తి వనన్ జరింపు; మీ
ప్రమథగణంబు నిన్నుఁ గొలు
వన్ గలవారలు; వారి నెల్లఁబూ
ర్ణముగను నేలుకొమ్ము 'గణ
నాథ' 'గణేశ్వర' నామధారివై."

వ. అని వాత్సల్యానురూపంబు లగు వరంబు లొసంగి కుమారు
లాలించుచున్న దేవదేవుం జేరి మృడాని, స్త్రీస్వభా

వంబు దీపింపఁ, బుత్త్రానురాగం బినుమడింపఁ "బ్రాణే శ్వరా! త్రిమూర్తులు నొక్కరూప యని మున్నాక ర్ణింతుఁ; గావున వారి తనూభవులు నట్లకావలదే? బ్రహ్మ పుత్త్రుండగు నారదుండు జ్ఞానంబున నద్వితీయుండు; నారా యణ సూనుం డగు సూనశరుండు త్రిజగజ్జేతయగు ధన్వి; నీ తనూజుండును దదనురూపంబగు ప్రాముఖ్యము వడయు నట్లుగా ననుగ్రహింపఁదగదే?" యని విలాసమధురంబుగ విన్నవింప, నమ్మహానుభావుండును, "దేవీ! నీ పల్కిన యది యథార్థము. మన తనయుండును జగత్త్రయ మాన నీయుం డయ్యెడు" మని యాతని ముఖంబునఁ బ్రసన్న దృష్టి నిగుడించి—

క. "లోకత్రయమునఁ గలవా
రేకార్యము నాచరింప నిచ్ఛించిన నా
యాకార్యవేళ నిన్నున్
జేకొని తొలుదొల్తఁబూజ సేయన్ వలయున్.

తే-గీ. భక్తగణములపైఁ బక్షపాత బుద్ధి,
మానివర్యుల యెడల సమ్మానభావ
మొప్పఁ జరియించి సులభసాధ్యుండ వగుచు
నఖిలజగములఁ దొలిపూజ లందుకొనుము.

సీ. స్నానమ్మునకును విఘ్నము రాక యుండ నిన్
మాయంబ ద్వారాన నిలిపియుంట,
అత్రమ్ముతో లోన నరుగు నా పోకకు
విఘ్నంబుఁ దొలుతఁ గావించి యుంట,

అటులు నన్నాఁగి మీ యంబ మజ్జనము వి
ఘ్నము నొందకుండఁగాఁ గాచియుంట,
ప్రథమమ్మునం దిట్లు ప్రాణవిఘ్నము నొంది
దాని నీరీతిగా దాఁటియుంట,
తే-గీ. ప్రథమ పూజనముల నంది భక్తవరులఁ
గాఁచుటయెకాక యవ్వారి కార్యములకు
విఘ్నములు రాకయుండఁ గావించునట్టి
ప్రాభవము నీ కొసంగితి వత్స! కొనుము.
క. నిను మును గొలువక కార్యము
లను జేయఁ గడంగువారలను విఘ్నమ్ముల్
గొనకొని బాధింపఁ దొడం
గును నానాగతుల వారి క్రొవ్వఱునట్టుల్.
క. శశ్వద్భక్తియుతుండై
శాశ్వతు నినుఁ గార్యవేళ స్మరియించెడు న
వ్విశ్వాసపరున కెన్నఁడు
విశ్వమ్మున విఘ్నమనుట వినఁబడకుండున్.
ఉ. పాము సుగంధివాసనను
బర్వులువాఱెడునట్లుగా భవ
న్నామజపంబుచే నిఁకఁ గ
నంబడకుండుత విఘ్నముల్! జన
స్తోమము విఘ్ననాథుఁ డను
చున్ నిను గొల్తురుగాక! విఘ్నప
స్వామిపదంబునందు నినుఁ
బట్టముఁగట్టితి; వేయునేటికిన్?”

క. తనయున కిటు వరముల నిడి
తనయంతటివానిఁ జేసి, తనియక, భవుఁ డా
వనజోదరు లోకైక
ప్రణుతుని డాయంగఁజని యపారముదమునన్.

మ. "పరమామ్నాయనికాయవందిత పదా
బ్జాతున్, మురారాతి, ని
ర్భర తేజో విభవప్రభావసహితున్,
భద్రానుసంధాయకున్,
గరిరాజావను, శంఖచక్రధరు, శ్రీ
కాంతామణీలోలు, భూ
భరణాయత్తమనస్కు, నిర్జిత రిపున్
బ్రార్థింతు నత్యంతమున్.

శా. నానారూపము లెత్తి దైత్యగణమున్
భంజించి, యాపన్న ర
క్షానైపుణ్యము మీఱ సర్వమయుఁడై
శక్రాది దేవౌఘ స
మ్మానం బందుచు భక్తహృజ్జలజ సం
వాసంబు గావించు ల
క్ష్మీనాథున్ భజియింతుఁ బుత్త్రిని వర
శ్రీమంతుఁ గావింపఁగన్."

క. అని సంస్తుతించు శంకరుఁ
గనుఁగొని, కనుగొనల నవ్వి, కంజాక్షుఁడు స
ప్రణయాంతఃకరణుండై
ఘనవర దానప్రకార కౌతుక మొదవన్.

ఉ. కౌఁగిట బిడ్డనిం బొదివి,
  కన్నులవెంట ముదశ్రు లొల్క, లో
నాఁగక ప్రేమ వెల్లిగొన,
  నంగజసన్నిభు నక్కుమారు శ్రీ
భాగరిమావిలాసునిఁ గృ
  పారస ముప్పతిలంగఁ జూచి, య
య్యాగమసూత్రసంతత వి
  హారి, మురారి పురారి కిట్లనున్:
క. "సర్వమయ! సర్వవందిత!
సర్వేశ్వర! సర్వరూప! సర్వాలంబా!
సర్వజ్ఞ! సర్వరంజక!
శర్వాణీనాథ! సర్వ సంపూర్ణ! శివా!
క. ఈవలసిన వరముల నీ
వీవలె కే యొసఁగియుంటి; వింకెక్కడు నేఁ
గావింపఁగలుగువాఁడనె?
నీవచనము దాఁటి మెలఁగ నేరను గానన్.-
చ. వరము లొసంగువాఁడ; సుర
  వందితు నీసుకుమారు నెవ్వఁ డా
దరమునఁ గొల్చు, వానికి నె
  దన్ గల కోర్కెల నేనె తీర్తు; సం
బరమున వాని నేఁ బరమ
  భాగవతోత్తముగాఁ దలంతు; న
శ్వరముగ ముక్తికాంత సుప
  కాంతునిగా నొనరింతు నీశ్వరా!

మ. శ్రవణానందము మీఱఁగాఁ బ్రథమ పూ
జాప్రాభవం బొంద నీ
వు వరం బిచ్చితి; వీశ్వరాంశజుల సం
పూజింపఁగాఁ గొంతు వై
ష్ణవచూడామణు లింత కొప్పరఁట, వి
ష్వక్సేనుఁ డంచున్ మదీ
యవరాఖ్యన్ దొలిపూజ లందుకొను వీఁ
డానంద మీవొందఁగన్.

ఉ. నాయకుఁ డొండు లేమిని వి
నాయకుఁడై, మహనీయ వేద వి
ధ్యేయ పదారవిందుఁడయి,
దీనజనావన కార్యలోలుఁడై,
శ్రీయుతుఁడై వశిత్వముఖ
సిద్ధుల నేలుచు, నిన్నుఁబోలి భ
ద్రాయితమూర్తియై యభవ!
ధన్యత నొందెడు నీ తనూజుఁడున్.

క. శక్రాదివందితుని, ని
ర్వక్ర పరాక్రముని వీని భజియింపని య
వ్యక్రీకృతకర్ముఁడు మ
చ్చక్రాహతి మ్రగ్గు నగ్ని శలభము భంగిన్."

క. ఈలీల శౌరి వలుకఁగ
బాలునిఁ గొని చని యభవుఁడు బ్రహ్మాకనియె, "స
ర్వాలంబ! సృష్టిలోలా!
చాలఁగ వరజాల మీ వొసంగు" మనవుడున్.

ఉ. స్రష్ట వచించె, "నీవిడినఁ జాలదొ? పంకజనాభ దత్త వి
స్పష్ట వరాళి కెక్కువ యొసంగ వలంతినొ? దేవికన్న సం
తుష్టుని జేసి తావకసుతున్ వెలయింతునొ? దేవదేవ! న
న్నిష్టవరంబు లిమ్మనుచు నేటికి నిట్టులు సంస్తుతింపఁగన్?
తే-గీ. ఐన నీమాటఁ ద్రోయఁగా నగునె నాకుఁ?
గాన వరమిత్తు నీ వరసూనుఁ డఖిల
వేద శాస్త్ర పురాణ విద్యాదులకును
ప్రభువుగా నుండి తత్తదుపాస్యుఁ డగును.
ఉ. భావమునందు నీసుతు ను
పాస్యునిగాఁ గొని తన్మహాత్వ సం
భావితచిత్తుఁడై తనరు
భాగవతోత్తముఁ డెల్లవేళ వి
ద్యావిషయమ్ములందునఁ బ్ర
ధానపదస్థితి నిల్చి యుక్త వా
చా విభవమ్మునందును న
సాధ్యపరాక్రమ సిద్ధి నొప్పెడున్.
తే-గీ. భోగ భాగ్యాయురారోగ్య పుత్త్రపౌత్త్ర
సంపదల, సర్వకళల సాధింపఁగోరు
ప్రాణికోటికి సులభ మార్గమ్ము, సర్వ
సాధనమ్ము వినాయకారాధనమ్ము."—ఇట్లు.
తే-గీ. అధిక వాత్సల్య మెసఁగ నిరంకుశాధి
కార విలసనములఁ దమకన్న నెక్కు
డగు మహోద్ధతి గణనాధునందుఁ గూర్చి
ప్రియమువడి చూచుచుండె మూర్తిత్రయంబు.

వ. ఇట్లు మూర్తిత్రయాస్తవర ప్రభావకలితుండగు సూనుం జూచి, యమందానందకందళిత హృదయారవిందయై దాక్షాయణి పూర్వోక్త వివిధనామంబుల వానిం జేరంబిలిచి, స్త్రీజనసమాజధర్మప్రేరితయై, వశీకృతసర్వ లోకావలోకయగు నయ్యిందిరాదేవికి వానిచే మ్రొక్కించి, నామెయు లో నుబికివచ్చు ప్రేమాతిశయమ్ముకతన విఘ్నేశ్వరు నొడియం దిడుకొని యిట్లనియె :

మ. "తనయా ! పూరుషసూక్త సద్విధులచే
తన్ నిన్నుఁ బూజించిరో,
ప్రణయంబారఁగ నీకథావిషయముల్
వ్రాయించిరో, వ్రాసిరో,
తనివారంగఁ బఠించిరో, మది నినున్
ధ్యానించిరో, నీ యుపా
సనధర్మంబున నున్నవారి గృహమ
స్మద్వాసయోగ్యం బగున్.

క. ప్రణయము సెలఁగఁగ నీగుణ
గణకథనము వెలయునెడల గౌరవమతి నే
నణఁకువ నుండుట 'లక్ష్మీ
గణపతి' యను పేరు నీకుఁ గలుగుఁ గుమారా.!"

క. అని వరమిచ్చెను; బదపడి
యనురాగము దోఁప వాణి యాబాలకునిన్
దన యంకమునందున నిడు
కొని వాత్సల్యమ్ము గ్రమ్ముకొన నిట్లనియెన్ :

శా. "భాషాకాంతుఁడు పుత్త్రిమోహజనిత
స్వాతంత్ర్యసంపూర్తి సం
తోషం బందుచు నిన్ను విద్యలకు నా
థుం జేసె; నవ్విద్యలన్
దోషోక్తింజను పూర్వపక్షములు వాఁ
డున్; వాని గుర్తించి త
ద్దోషంబుల్ హరియించు శక్తి నినుఁ బొం
దుంగావుతన్ బుత్త్రికా!

శా. భక్తుం డెవ్వఁడు నిన్ భజించు, నతనిన్
భర్జింపఁగా నెంచి దు
ర్వ్యక్తృత్వంబున సాగు దుర్మతుల వా
గ్బంధంబుగావింప మ
చ్ఛక్తుల్ లోకములందుఁ గుమ్మరును; త
ద్వాత్సల్య సంపూర్తి నీ
భక్తుం డెల్లెడలన్ జయం బుఁగొను వి
ద్వద్వాద భేదంబులన్.

సీ. శూన్యవాదాంబుజ శుండాలకరము, వి
తర్కవాదారణ్య దావవహ్ని,
మూర్ఖదుర్వ్యాకృతమోహవ్యాప్తి రవిదీప్తి,
గర్వితవాక్యాహి గారుడ బు,
దుష్ప్రలాపసింధుర సింహశాబంబు,
శాత్రవదుర్వచశ్చంద్రరాహు,
పరివిప్రలాపాచలాగ్ర వజ్రాహతి,
వక్రభాషణదైత్య చక్రధార,

తే-గీ. దుర్మదోన్మత్త కుత్సిత ధూర్తలపిత
పూర్వపక్షవిహంగ నిర్మూలన ప్ర
ధానకార్యపరాయణ శ్యేన మగుచుఁ
బుత్త్రి! నీ పదభక్తి సర్వత్ర చెలఁగు.

తే-గీ. నిన్నుఁ దనియించువారల నెలవులందు
శ్రీరమాదేవి నిల్చిన చెల్వు దోఁప
నిన్నుపాసించి తనియించు నిపుణమతుల
జిహ్వపై నేను నాట్యంబు సేయుచుందు.

క. అత్తను, గోడలి నొక్కటఁ
బొత్తున నిలుపందలంచు పుణ్యాత్ములు నిన్
బుత్త్రిని గొల్చెద రిపయిఁ
జిత్తమ్ముల" నంచు వాణి చిఱున వ్వెసఁగన్.

తే-గీ. పలికె; నాపైని దిక్పాల వరులు, దేవ
గణము, మౌనీశ్వరులుఁ, దక్కఁ గల్గువారు
చేతనైనన్ని కానుకలు శ్రీమహేశు
పుత్త్రికున కిచ్చి సంభ్రమపూర్ణు లైరి.

వ. అట్టియెడ నప్పరిషన్మధ్యంబునం గల భృంగి యప్పార్వతీ
నందనునకు నెద్దియేనిఁ గానుక నిడ నెంచి,

క. అచ్చోటఁ బరువులెత్తుచు
ముచ్చటఁ గల్గించు చిన్ని మూషకమును దా
మెచ్చుచు మది గణపతికిన్
దెచ్చి యొసఁగె, 'దీని నెక్కి తిరుగు' మటంచున్.

తే-గీ. కూరిమి నొసంగు తృణమైన, మేరువైన
భేదమెంచనివాఁ డంచు విబుధవరులు

దలఁచి యుష్ట్రాంగఁగా భృంగిదత్తమైన
మూషకము వాహనమ్ముగాఁ బొందె నతఁడు.

వ. పదంపడి పక్షీంద్రుం డద్దానికిఁ గామగమనాదు లొసంగె; విధాత దీర్ఘాయురనామయసమంచిత దివ్యదేహంబు నిచ్చె. ఇట్లా గణేశ్వరుం డద్వితీయులయ్యును, భార్యాద్వితీయు లగు నమ్మువ్వురు మూర్తులచే నొసంగఁబడిన వరంబులను, దేవౌఘుని వేదితోపాయనంబులను, భృంగీశ్వర దత్తవాహనంబును గ్రహించి, యచ్చోఁ గలవారిం దని యించె; నంతఁ దత్కుటుంబమునొద్ద సెలవుఁగైకొని సృష్టికార్యత్వరితాంతఃకరణుండై బ్రహ్మ నిజభార్యా సహితంబుగా సత్యలోకంబున కరిగె; శ్రీమన్నారాయణుం డును లక్ష్మీదేవితోఁగూడి పక్షీంద్రు నధిరోహించి వైకుంఠధామంబునకుం బ్రయాణంబు సాగించి చనియె; దిక్పాలురును నిజావాసమ్ములకుం జని; రంత—

తే-గీ. బ్రహ్మమానససుతుఁడు నారదుఁడు తద్వి
శేషముల నెల్ల వీణపైఁ జేర్చి స్వర వి
తానములఁ దానములఁ బాడ ధరణి నెల్లఁ
బ్రచురమయ్యెను విఘ్నరాట్ప్రభవ విధము.

సీ. 'సులభసాధ్యుండఁట చూచెదు గా'కంచు
సతు లొండొకరితోడఁ జాటుకొనిరి;
'మ్రొక్కినంతనె వరమ్ముల నిచ్చు నఁట' యంచు
పతులు భార్యలతోడఁ బలుకఁగనిరి;

'మూర్తిత్రయంబును బురుడించు నట' యంచు
భక్తులు తద్భక్తిఁ బాడుకొనిరి;
'ఐహికాముష్మిక మ్మలవర్చు నట' యంచు
నందందు జనులు మాటాడుకొనిరి;
తే-గీ. 'మఱపునొందక కార్యావసరములందుఁ
దొలుత నీతనిఁ బూజింపఁ దొడఁగువారి
కఖిల కల్యాణములు గల్గు'ననుచు సుజన
వరులు కొనియాడఁ గసిరి పార్వతి తనూజు.
శా. యజ్ఞాదుల్ పచరించుకాలమున బ్రా
హ్మణ్యంబు తత్త్వోపదే
శజ్ఞాతవ్యు, వనన్యసాధ్యవర వి
స్తారప్రదానైక శ్రీ
లజ్ఞానిన్, గిరిజాసతీ వరసుతున్
లంబోదరుం గొల్చి, త
ద్విజ్ఞానంబున విస్మరించి ర
టుపై విఘ్నప్రమాదంబులన్.
ఉ. శాత్త్రవ దుర్గము ల్గొనఁగ
సాగెడుపట్టున భక్తియుక్తి మూ
ర్తిత్రయసుస్వరూపు గణ
దేవుఁ బరాత్పరుఁ బూజసేయు సు
క్షత్త్రియ వంశ్యు లా సమర
కాలములన్ గసికందకుండ స
ర్వత్ర జయమ్ము నొంది, గజ
వక్త్రుని శక్తికి మెత్తు రాత్మలన్.

శా. వాణిజ్య మ్మొనరించుపట్టున వణి
గ్వర్గంబు సద్భక్తి శ
ర్వాణీనందను, నార్తరక్షణు నెదన్
భావించి పూజించి, క
ల్యాణశ్రీధనధాన్యవైభవము లె
ల్లన్ బొంది 'మాబోంట్లకున్
ప్రాణాధారము చిక్కె నేఁటి' కనుచున్
భాషింతు రుప్పొంగుచున్.

క. హాలికులు విఘ్నేశ్వరునిం
గొలుచుటఁ బంటలను బొందిఁ గొఱఁతవడక "మ
మ్మలరింపఁ బుట్టినాఁ డీ
సులభుం"డని యెదలఁ దలఁచుచుం బొంగి రహో!

శా. ఆరోగ్యాయువు లాసఁజేయుచు, జయం
బాసించుచున్, భోగభా
గ్యారామావసథంబు లుత్తమతురం
గానీక మర్థింపుచున్,
సారాచారయశః ప్రపూరిత మహా
సామ్రాజ్య మాసింపుచున్
ప్రారంభంబునఁ గొల్తు రెల్లరు విచి
త్రస్ఫూర్తి విఘ్నేశ్వరున్.

శా. విద్యాబుద్ధులఁ, గామినీజనములన్,
విజ్ఞానమున్, ప్రాభవ
ప్రోద్యద్గౌరవ, మష్టసిద్ధులఁ, గవి
త్వోద్యోగసందీప్తి, దు

శాస్త్రద్వ్యచ్ఛతుర్వి విదారణైకపరతం
  త్ర జ్ఞానమున్ భక్తులం
చదోగంబునఁ గాంతు రమ్మహితు పూ
  జావైభవస్ఫూర్తిచేన్.

క. ఇది యది యన నేటికి, నె
య్యది యొదవఁగ మదిని దలఁచి యర్చింతురు త
త్పదముల, నాయా వస్తు స
ముదయ ముదయమగును విదితము; దయావిధముల్.

మ. 'అపురూపమ్ముగఁ జిక్కె నీ సులభ సా
  ధ్యవ్యక్తి' యంచున్ గణే
శపదాబ్జంబులఁ బూజసేసియు, నభీ
  ష్టప్రాప్తి సాధించియున్,
జపముల్ సేసియుఁ దృప్తినొంద 'కెపు డీ
  సంవత్సరం బేగు? భా
ద్రపదం బెప్పుడు వచ్చు' నంచు నెదలం
  దర్కింతు రెల్లారలున్.

తే-గీ. "భాద్రపద శుద్ధచవితి * నీశ్వరకుమారు
నకును వర్ధంతిఁజేయుఁ డండఱు నటంచు
నీశ్వరి స్వయంబుగా నాజ్ఞ యిచ్చె నఁట;
భాద్రపద మింక నెప్పుడు వచ్చు" ననుచు.

ఆ-వె. రత్నభూషణముల, రథముల, వాజుల,
సింధురములఁ, గనక సింహపీఠి

---

* శుద్ధచతుర్థికి వాడుకొను రూపమిది.

కాద్యుపాయనముల నర్చింతు మని జను
లాత్రమందుచున్న యవసరమున.

సీ. గర్విమానసమందుఁ బర్వు మోహాంధకా
రమువోలె మేఘముల్ గ్రమ్మె దెసల;
దుర్బుద్ధులౌ పండితుల గుణమ్ముల పోల్కి
నక్షత్రగణము కన్పడుట మానె;
విబుధచిత్తమ్ముఁ బ్రవేశించు జ్ఞానమ్ము
గతి వెలుంగుచుఁ దటిల్లతలు దోఁచెఁ;
బాపాత్ము హృదయమ్ము పగిది నదీనద
జలములు పంకదోషమ్ము నెనసె;

తే-గీ. సరసఘను లొందు రాయిడి సర్వదా కు
జాతుల నడంచునట్టు లశని నిపాత
మడఁగఁద్రొక్కెను వృక్షసంహతుల భద్ర
పర్వనందితమౌ భాద్రపదము రాఁగ.

తే-గీ. 'అమృత వృష్టికదా ఘనాపాంగదృష్టి'
యనుచుఁ గృషిలోలు రందందు నాడుకొనఁగ
సస్యజాతులు దలయెత్తి 'సత్య' మనుచుఁ
బలుకుచున్నట్లు దోఁచెఁ జూపఱకు నెల్ల;

తే-గీ. చాతకమ్ములు వర్షాతిశయమునకును
దనిసె; యువతీపరీరంభతతసుఖ ప్ర
మోదభరితాంతరంగమై పురుషగణము
హాయి నిద్రించె భాద్రపదాగమమున.

క. సరసామోదము సెలఁగెన్;
 వరవిటపశ్రేణి తాపవర్జితమయ్యెన్;
 బరమానందము నందుచుఁ
 గరము లతాతన్వు లతనుకళలం దేరెన్.
తే-గీ. అఖిల సంతోషకారణంబైన వర్ష
 ఋతువు పాంథోపకారిగా నెసఁగదయ్యెఁ;
 బలువు రానందమొందెడు పట్టునందు
 నైన త మొకొ్కక్కరికిఁ జిక్కు సంభవించు.
క. ఆరీతి భాద్రపద మరు
 దేరఁగ నానందజలధిఁ దేలిరి జనముల్
 'గౌరీపుత్త్రి పదాబ్జము
 లారాధింపంగ వేళయయ్యె' నటంచున్.
తే-గీ. భాద్రపదమందుఁ దొలి మూఁడు వాసరములు
 సనియె; మఱునాఁడు గణపతి జననదిన మ
 హోత్సవం బంచు జనము లొండొరులతోడఁ
 బల్కికొని; రంత నంతఁ బ్రభాతమయ్యె.
ఉ. "అక్కజమైన యట్టి వర
  మంబిక యే యిడె; నెల్ల వారలున్
 మక్కువమై వినాయకుఁ బ్ర
  మంబునఁ బూజలొనర్పుఁ; డిష్టముల్
 ప్రక్కనఁ బొం దుఁ" డంచుఁ దమ
  కంఠము లెత్తి వచించుచున్నటుల్
 కుక్కుటముల్ త్రిభంగిమెయిఁ
  గూయఁగసాగెను వేఁగుజామునన్

క. తమ శాస్త్ర సరణిఁ దద్దివ
సమునన్ నాథునకు వచ్చు శాప మెఱిఁగి ఖే
దముచే నన నక్షత్ర గ
ణము మాటువడె న్నభంబునన్ వేర్వేఱన్.

క. 'గిరిరాజ తనయకోప
స్ఫురణము నీవఱకు నెపుడుఁ జూడ ; మఱియు నేఁ
డరయఁగ వలయును గద' యను
వెరపున నన దశదిశలును వెల్వెలఁబాఱెన్.

శా. 'భక్తుల్ సేసెడు పూజ లందుకొనఁ దా
త్పర్యంబు సంధిల్లఁగా
వ్యక్తావ్యక్తుఁడు పార్వతీసుతుఁడు రా
నైయుండి, యీమాట సు
వ్యక్తంబుం బచరింపఁ దొల్దొలుత న
న్నంపెంజుఁడీ' యంచు సా
ధూక్తుల్దెల్పుచు నున్నపోల్కి నరుణుం
డొప్పారెఁ బ్రాగ్దిక్కునన్.

వ. అట్టి ప్రభాతకాలంబున నెల్లవారలును నిద్రలేచి యహా
ర్ముఖోచితకృత్యంబులం దీర్చుకొని, చిరకాలాకాంక్షిత
పర్వదినం బేతెంచెఁ గదా యని సంతోషసంభరిత హృద
యులై, మజ్జనాదిక్రియల నిర్వర్తించి, గృహములు తోర
ణంబుల నలంకరించి, నూతనవస్త్రధారణంబు సేసి,
విఘ్నేశ్వరునకుఁ బ్రియభక్ష్యంబులెవ్వి యగునని చర్చించి,
గజంబునకుఁ గపిత్థఫలంబు ప్రియంబగుట గజవదనుండగు
నమ్మహానుభావునకుఁ గపిత్థఫలసంకాశంబులగు మోద

కంబులు ప్రియంబులగు నని నిశ్చయించి, యవ్వాని సిద్ధపఱిచి, 'తృణమైనను మేరుసదృశంబుగాఁ గైకొను'మని తనయునకు బోధించిన జగజ్జననీవాక్యంబులు మున్ను నారదునిచే వినియున్నవారు గావున దూర్వాంకురమ్ములను బదిలపఱిచి, బిల్వాదళచందన పుష్పాక్షతధూప దీపద్రవ్యతాంబూలాది పూజాద్రవ్యంబులు సేకరించుకొని, యథాశక్తి కనకరజతతామ్రదారుమృణ్మయాదులఁ దమతమ నిర్మాణకౌశలంబున మూషకంబును, దాని నధిరోహించు నపురూపరాహుత్తుండగు విఘ్నేశ్వరుని నిర్మించి, నిర్మింపఁ జేసి, పురోహిత బంధుమిత్త్రభృత్యసహితులై, విధ్యుక్తంబుగా ధ్యానావాహనాది షోడశోపచారంబులం బూజింప నుపక్రమించునవసరంబునఁ గైలాసనగంబునందు—

తే-గీ. అత్రమున లేచి గిరిపుత్త్రి యంత విఘ్న
నాథుఁ జేరంగఁ బిలిచి, "చిన్నారి తండ్రి!
జనులు నా వరయుక్తి నీ జననదిన మ
హోత్సవంబులఁ జేయుచు నున్నవారు.

ఉ. కావున వేగ లెమ్ము త్రిజ
గంబులఁ జూచెదు వేడ్కమై కుమా
రా! విను" మంచుఁ దెల్పు నెడ,
"రాజతశైలనివాస! పాహి మాం

భో! విపులాంతరంగ! పరి
పూర్ణదయామయ! యేకదంత! గౌ
రీవరపుత్త్రి! పావనచ
రిత్ర!నమో" యను భక్తవాక్యముల్.

సీ. "పార్వతీ పుత్త్రాయ, భవ్యచారిత్రాయ,
శ్రీనుతగాత్రాయ, తే నమోస్తు,
విఘటిత పాపాయ, విదళితతాపాయ,
మానిత రూపాయ తే నమోస్తు,
ఓంకారవాసాయ, యోగవిలాసాయ,
దితమునిత్రాసాయ తే నమోస్తు,
కరుణాసముద్రాయ, నిరతనిర్నిద్రాయ,
జ్ఞాన సన్ముద్రాయ తే నమోస్తు,

తే-గీ. సచ్చిదానంద వేషాయ, సకలరత్న
రచిత భూషాయ, సిద్ధి విరాజితాయ,
సర్వ సంపూజితాయ, శశ్వచ్ఛుభ ప్ర
దానశీలాయ, బాలాయ తే నమోస్తు."

క. అని నానా దిక్కులను
వినఁబడఁగా, నంబ "తండ్రి! వేవేగమె వా
హనమెక్కి భక్తవర్యులఁ
గని తద్వాంఛితము లిచ్చి కడువడి రమ్మా!

ఆ-వె. సేవ యల్పమైనఁ జిత్తశుద్ధి గలట్టి
వారిఁ జేరి యుక్త వరము లిచ్చి
తనియఁజేయు నీదు తండ్రి; యావిధము నీ
వేమఱంగఁ దగ దొకించుకేని.

శా. శాంతంబుఁ, దపముఁ, బరోపకృతియుఁ,
సత్యంబు, యజ్ఞక్రియా
చింతాసంగతి, వేదగౌరవము, వా
సిన్ జీవకారుణ్య, మ
త్యంతజ్ఞానమయప్రవర్తనము లో
నా సద్గుణవ్రాత వి
క్రాంతిన్ రంజిలు బ్రాహ్మణోత్తములు త్వ
త్ప్రాంచత్కృపాపాత్రముల్.

మ. అతుల బ్రాహ్మణ దైవభక్తి, సుజనో
క్తాచారసంయుక్తి, దు
ర్మతశిక్షాచరణప్రసక్తి, చతురా
మ్నాయార్థ సంసక్తి, స
న్మతరక్షా గరిమానురక్తి, సకల
న్యాయోక్త సాధూక్తి, స
ప్రతిమానోద్ధతి నుండు క్షాత్రము కృపా
పాత్రంబు నీ కయ్యెడున్.

ఆ-వె. ఆర్యజన నివేదితాచార సంపత్తి
వేల్పులందుఁ బుడమి వేల్పులందు
భక్తిఁ గలిగి భూమిపాలుని గౌరవ
మ్మునను జూచు వైశ్యుఁ బ్రోవు మీవు.

క. హాలముఖ సాధిత సంపద
కులుకక, వినయంబు భక్తియుం జెన్నారన్
మెలఁగెడు శూద్ర జనమ్ముల
వలనను నీ కరుణ వెలయవలయుఁ గుమారా!

వ. ఏతదుక్తవిధంబులు సాధారణధర్మంబు; లింక నుపదేశింప వలసిన యంశంబులుగలవు; కాని 'సులభసాధ్యుండ వగు' మని మాతండ్రి నీ కింతకుమున్న బోధించియున్నవాఁడు కావున నీ కిందలి సారాంశ మ్మెఱింగించెద; నాలింపుము. సర్వశుభప్రదంబగు దైవభక్తిచే నెసఁగువారెల్లరును నీ కారుణ్యంబునకుం బాత్రంబులు; 'భక్తిమాత్రమున సర్వం బును సాధింపఁబడు; నద్దానికి దుస్సాధ్యం బెద్దియును లే'దని నీజనకుండు నాకు బోధించియున్నవాఁడు; అట్టి భక్తి యెచ్చ టెచ్చటఁ గన్పట్టు, నట్టియెడల నీవు నిరుపమానకారుణ్య మూర్తివై మెలంగవలయు; ఇంతకును నిర్హేతుకజాయ మాన కటాక్షవీక్షణ నిధియును, స్మరణమాత్ర సంతుష్ట హృదయపద్మండును, భక్తపరాయణుండును నగు కైలా సాధినాథుని పుత్త్రుండవగు నీకు బుద్ధులు సెప్పనేల ? ఆతని మించిన దయగలవాఁడవని పేరొందిన, నేను సంతసింతు నని యా జగజ్జనని జగద్ధిత సంకేతంబు లుపదేశించి, మరల మరల ముద్దాడి, మూషకము నారోహింపఁజేసి, "తనయా! భక్తానురక్తిచేఁ దడయక, శీఘ్రమ్మున నరుదె"మ్మని, విడ వఁజాలక యెట్టకేల కాతని పోకకు సమ్మతించి యనుప, నాతండును గామగమనంబునఁ బ్రయాణంబు సాగించుచు.

సీ. తృణమైనఁజాలు, 'విఘ్నేశ్వరార్పణ' మన్న
వారి కిష్టావాప్తిఁ బరఁగఁజేసి,
మంచి మాటలచేత మన్నించినన్ జాలు,
వారికి శుభములఁ జూఱయిచ్చి,

స్తోత్రారం గాఁ దన పేరు పఠించినఁ
జాలు, వారల కిష్టములఁ గూర్చి,
విధ్యుక్త పూజల వెలయించువారల
నరసినఁ బారవశ్యంబు నంది,
తే-గీ. మతవిభేదమ్ములను జేసి మమతఁ దూలు
వారి యజ్ఞానమునకు విభ్రాంతి నవ్వి,
సద్వ్యసనములగువారల జతనములకు
సంతసించుచు నరుగు నీశ్వరసుతుండు.
క. తనతండ్రిఁ గూర్చి జపములు,
వినుతులు పచరించువారి వీక్షించి దయా
ఘనుఁడగుచు వారి యిష్టము
లను దానే యొసఁగు 'భోగలంగకుఁ' డనుచున్.
క. దేవీభక్తులఁ గనుఁగొని
భావం బలరార 'నిష్ట పదములు వేఁడుం;
డీవలసి వచ్చినా' నని
యావారల కోర్కు లిచ్చి యాత్మను మురియున్.
చ. క్రమమునఁ దన్ను మున్గొలిచి
కార్యములన్ ఘటియించువారి యు
ద్యమముల కాత్మ మెచ్చి, తగి
నంత సహాయుఁడుగా మెలంగి, వి
ఘ్నములను బాపి, వా రనెడు
గౌరవ వాక్యము లాలకించి లో
వ మురియు బాల్యచాపలము
నన్ మహనీయుఁ డతండు సన్మతిన్.

సీ. అతనిఁ బూజించి లో నానందముం జెందు
ప్రియభక్తులను సత్కరించి మెచ్చు;
తన కథాయాథార్థ్యమును గుర్తెఱిఁగి వ్రాయు
కవివర్యులందు సైక్యంబుఁ జెందు;
నిజగుణగణకథా నిపుణులౌ పండిత
వర్యుల కీప్సితవరము లొసఁగు;
మూఢభక్తిగ నొక్క మ్రొక్కు మ్రొక్కెడివారి
మతి నెంచి లోఁ బ్రసన్నత వహించు;

తే-గీ. భక్తులిచ్చిన భూషణ వస్త్రరాజ
భక్ష్యములు దొంతరలు వెట్టు భద్రముగను;
మూషకము మీఁదఁ బెట్టు నా మూటలెల్లఁ
దల్లికిం జూప నెదలోనఁ దలఁచినట్లు.

ఆ-వె. 'బాలనాయకత్వలీలలు ప్రజలకు
బాధసేయు నను' టబద్ధమయ్యె;
బాలుఁడయ్యు విఘ్నపతి నాఁడు గావించు
తీరుఁ జూచినట్టివారికెల్ల.

వ. ఆపగిది భక్తపరాయణత్వంబు నేమఱక, సులభతం గోల్చొవక, ప్రథమ జయంతి మహోత్సవ విశేషంబుల నీక్షించుచు, స్వప్రాభవంబునకు మురియుచు,

శా. రక్తిం గోరెడు బాలభక్తుల మదుల్
రంజించి దీవించి, స
ద్భక్తిన్ గోరెడు వృద్ధలోకమును సం
భావించి లాలించి, యా

సక్తిన్ దత్వమసిప్రధాన పరులం
జాలంగ వీక్షించి, మా
త్రోక్తాదేశము మేరమీఱక యనం
త్రోత్సాహియై యేగుచోన్.

క. నగజాసుతు తేజమునకు
విగతుండయి మనమునందు బిడియముపడి యా
నగచేత నన(గ( బశ్చిమ
నగభాగము సేరె రవి కనంబడకుండన్.

శా. పాఱెం బక్షులు బారుబారులుగ నభ్రంబందు;గోష్ఠంబులన్
జేరెం గోవులు వర్వులెత్తుకొని; దిక్సీమావధుల్ బిట్టు కెం
పాఱెన్; జక్రపతంగదంపతులు విభ్రాంతంబులై పెన్వగన్
గూరెన్;దారలు మెల్ల మెల్ల నభమందుం దారె;నప్పట్టునన్.

సీ. చక్రబాధాకారణాక్రమ సంచారి,
క్షయరోగపీడిత గాత్రయుతుడు,
పద్మినీసముదయ ప్రత్యక్షశత్రువుం,
డఖిలసన్నివహ శోభాపహారి,
విషరాశిసంభూత వితథయశస్కుండు,
హాలాహలదురాసదానుజుండు,
గురుతల్పగమన దుర్భరపాతకుండు, ని
శాచరుండు; కళంక సంగతుండు,

తే-గీ. గోవధవిధాన ధౌరేయ సేవితుండు,
విప్రయోగారి మిత్ర ప్రవృద్ధికాల
సముదితోన్మద మూర్తి, దోషాకరుండు
కాలగతిఁ దోఁచె గగనభాగంబునందు.

చ. 'ఖరకరుఁ డంబుధింబడియెఁ
గాలవశంబున' నంచు లోకులం
దఱు నన నాలకించియును
దథ్యమొ! కల్లయొ! తాను కన్గొనన్
ద్వరపడి తత్ప్రదేశము ని
దానముగాఁ బరికించుచున్నటుల్
మెఱయుచుఁ బశ్చిమాశను స
మీపమునం బొడసూపెఁ జంద్రుఁడున్.

క. దిననాథుఁడు తీఱుటచేఁ
దనదే సర్వమ్ము ననెడు తతగర్వముచే
జనియించిన కొమ్ములనన్
మునుముందుగఁ దోఁచె శృంగములు చంద్రునకున్.

తే-గీ. శాశ్వతముగానియట్టి రాజ్యమ్మెఱింగి
వ్యాధిపీడితమైన దేహంబు నెఱిఁగి
గడియలం దీఱునట్టి భోగమ్ము లెఱిఁగి
యెమ్మెలేటికి ? పైపెచ్చు కొమ్ములేల ?

శా. ఆరీతిన్ శశి గానుపించి కనె భ
క్త్యుద్వ్రాతసంభార వి
స్తారాకంపిత మూషకున్, రుచిర భూ
షాగంధమాల్యాది స
త్కారస్ఫూర్జిత వేషకున్, నిఖిల భ
క్తస్తోమ సంపోషకున్,
సారాచార సుభాషకున్, దురిత వి
ఘ్నవ్యాళ సంశోషకున్.

ఉ. భాసుర శంకరాచల నివాసుఁ, గృపా పరిపాకమానసో
ల్లాసు, ననేకభూషణవిలాసు, నిరస్త సమస్త భక్త సం
త్రాసు, నతార్థిలోక పరిరక్షణ చిన్మయ మందహాసునిన్,
వ్యాసముఖాది మౌనినుత నర్తనరంజిత కృత్తివాసునిన్.
ఉ. పాపలతాలవిత్రుని, నపాయభుజంగమునైనతేయు, సం
తాపతమస్సహస్రకరు, దారుణకార్యపరాయణా హితా
టోపసమీరభక్షణ పటువ్రత పన్నగనాథు, భక్త హృ
త్తాపతపోనిరాసన కథాజలదాగము నాగభూషణున్.
శా. ప్రాలేయాచల కన్యకావరసుతున్, భద్రానుసంధాయకున్,
వ్యాళస్ఫారి ఫణావివిక్తమణి వారానల్ప దివ్యప్రభా
జాలవ్యాప్తశరీరు, రత్నమయ భాస్వత్కుండలోపేతు, ధా
రాళజ్ఞాన మయాత్మకున్, మహిత నిర్వాణాధికారప్రభున్.
క. కని, యా ప్రాభవమునకున్
మనమున వెఱగంది, యకుమారుని సొగసున్
గనుఁగొని చంద్రుఁడు లో సి
ట్లనుకొనె భవితవ్య మెఱుఁగనట్టిఁడు గానన్.
సీ. "పరమేశ్వరుండుఁ, బర్వతరాజసుత యెంత
నోచిరో యిట్టి తనూజుఁ గాంచ!
ప్రమథగణమ్ము తప మ్మెంత సేసెనో
యీబాలు సేవించు నిచ్ఛతోడ!
రాజతాచల మంతరమున నీశ్వరు నెంత
యర్థించెనో వీని నాశ్రయింప!
లోకు లెంతటి ఋతశ్లోకులో నేఁడిట్టు
లనివార వీని పాదములు గొల్వ!

తే-గీ. స్వర్గ మర్త్యభుజంగ విష్టపములందు
నీవిలాసంబు గలదె యొక్కించుకేని ?”
యనుచు లోలోనఁ జింతించి యక్కుమారు
సౌకుమార్యంబు పదిపది సార్లు గాంచె.

ఉ. నెమ్మదిలోఁ గుతూహలము
నెక్కొనఁజూచుట రాజదృష్టి దో
షమ్మనఁ జేసి యాత్మ వివ
శత్వమునొందఁగఁ జేతిలోని భ
క్ష్యమ్ములు నిట్టునట్టు పడఁ,
గట్టిన పుట్టము దాఱుమాఱుగాఁ,
గమ్మని పూవులుం జెదరఁ
గా గణనాథుఁడు మూర్ఛనొందినన్.

మ. జలధుల్ ఘూర్ణిలె; దిక్కరు ల్గలఁగె; ఝం
ఝూవాతము ల్మించె; నా
కులతం జెందెను సప్తపర్వతములున్;
గుంభీనసాధీశుఁడున్
గలఁకెన్; దారక లొక్కపెట్టున యథా
స్థానమ్ములన్ వీడె; ను
ల్కలు రాలెన్; దశదిక్తటంబులు గడుం
గంపించె నప్పట్టునన్.

వ. అంతఁ గైలాసమ్మున నిఖిలభువనరక్షణపరాయత్తచిత్త
యగు దాక్షాయణి, సాయంసమయంబైనను నిజతనూజుం
డిలుసేరకుంటకుం జింతించి, తాండవోత్సాహదోహలుం

డగు శంకరుండు పిలిచినం జనక, పుత్త్రాగమనంబు నిరీ
క్షించుచుండు నవసరంబున.

సీ. శివకేశవాభేద శేముషీసాహిత్య
వల్లకీస్వరము లంబరమునిండ,
వక్త్రాబ్జ నిర్గత భక్తిరసైక వి
లాసపదంబు లుల్లంబుఁ దనుప,
గళసమలంకృత తులసికాదామ బం
ధురగంధ పూరంబు దొప్పదోఁగ,
బ్రహ్మతేజమ్మును స్వశరీరకాంతి పుం
జమ్ము దిక్సీమాంతరమ్ముఁ గ్రమ్మ

తే-గీ. వచ్చె భాగవతోత్తమప్రవరుఁ, డఖిల
ధర్మశాస్త్రార్థ విదురుఁడు, దైవకథన
పరుఁడు, సుజ్ఞాన నిర్జిత స్మరుఁడు, బుద్ధి
గురుఁడు, నారదసన్మునివరుఁడు వేడ్క.

వ. ఇట్లభ్యాగతుండగు సురమునిశ్రేష్ఠు నర్ఘ్యపాద్యాదులఁ
బూజించి, సుఖోపవిష్టుం జేసి, దేవి యిట్లనియె:

క. "పసివాఁడు సులభసాధ్యుఁడు
వసగలవాఁ డనుచుఁ జేరి భక్తులు వరముల్
గొసరఁగఁ దన్మయుఁడై యిటు
మసలుట న్యాయంబె తనకు మానీ! చెపుమా!

ఉ. కాక నిశాచరుం డెవఁడు
గాని యలంచెనో? యేమి మూడెనో!
యేకత మిట్లు చిక్కెనని
యెవ్వరు పట్టిరో? యెందుఁ జూతు మా

నీ! కొమరుండు రామికిని
హేతు వొకింత యెఱుంగు దేని వే
వే కరుణించి తెల్పు" మని
వేఁడెను సంబకు నారదుం డనున్:

క. "తల్లి! యప్రియమని నా
యుల్లము సంకోచమొందు నొక్కట; నైనన్
దెల్లము సేయన్వలె; నీ
పిల్లఁడు పడె రాజదృష్టి పేరిమి కతనన్."

మ. అనునంతం గను లెఱ్ఱవాఱ, ఘన కో
పాయత్తసంరంభ సం
జనితాటోపముతోడ లేచి, విమల
జ్ఞానంబు పోఁబెట్టి, "యే
మనె? దేమంటివి? రాజదృష్టిపడి వి
ఘ్నాధీశ్వరుం డెట్టు, లెం
దున నేలంబడె?" నంచుఁ బార్వతి వ్యథా
దోదూయమానాత్మయై.

చ. "పదపద! యెందుఁ దాఁ బడియె
భక్తపరాయణ మూర్తి యాతఁ? డు
న్మదమున రాజుసూచునటె?
మానసమందునఁ బర్వతాత్మజా
సదమల శక్తి నెంచఁడొకొ?
సాహస మింతగ నున్నె? లెమ్ము; నా
రద! గణనాథుఁ డెందుఁ బడె?
రమ్ము; సమస్తముఁ జూచెదం దునన్".

వ. అని కోపావేశంబున నాకంపితశరీరయు, భుజనటద్ధమ్మిల్లభారయు, విలోలాలకయు, సంచలితకుండలయు, రక్తాననయు నై, మూర్తిమంతంబగు ప్రళయకాలంబు భంగిఁ గనుపట్టి యుత్తరీయచేలాంచలంబున నడుము బిగఁగట్టి యమ్మహాశక్తి.

తే-గీ. నారదుఁడు ద్రోవఁజూపుచు నడువఁ, బ్రమథ
గణము శక్తులు వెంటరాఁ గదలి, రాజ
దృష్టి మూర్ఖవివశుఁడయి యెఱుక తప్పి
వసరు సుతుఁ జూచి యాగ్రహ మ్మనువదింప.

శా. "పాపిష్ఠ చంద్రుని రూపుమాపెదను శా
పంబిచ్చి; బ్రహ్మాదులన్
గోపాగ్నిం బడవైతుఁ దత్ప్రణయము; త
త్కూటంగల్గు లోకమ్ములన్
మాపంబూనెదఁ; బుత్త్రికుం గనెద నే
న్యాయంబు నాకేల? ఛీ!
ఛీ! పాపాత్మకముల్ జగంబు" లనుచున్
శక్తిభ్రమస్ఫూర్తిరై.

శా. మధ్యాహ్నార్క సహస్రరూపయయి "స
మ్మాన్యార్చ్య, లోకత్రయా
రాధ్యున్, విశ్వజనీనపావను, సదా
ర బ్రహ్మవిజ్ఞాన దృ

క్సాన్ధ్యాన్ నా సుతు నిట్లు సేయు ఖలుఁ గాం
చన్ రాదు; కన్గొన్న చో
మిథ్యానిందలఁ జెందు లోక"మని తా
ల్మిన్ వీడి శాపంబిడెన్.

వ. ఇట్లు తత్కాలంబునకు నోటవచ్చిన శాపంబిచ్చి, యాగ్రహంబు తీరమి నింకెద్దియేనియుం బల్కనుండు సమయంబున.

సీ. 'ప్రళయంబు వచ్చిన పగిదిఁ దోఁచె' నటంచు
భయమొంది విచ్చేసెఁ బద్మభవుఁడు;
'ఈశ్వరీశక్తిచే నేమైన నగు'నంచు
సాధ్వసంబున వచ్చెఁ జక్రధరుఁడు;
'కోపంబువచ్చె నన్ గూడ లెక్కింపదో'
యని కొంకుచును వచ్చె నంధకారి;
'జగములు చెటొందు సమయ మయ్యె' నటంచు
వడఁకుచు నరుదెంచెఁ బాకవైరి;

తే-గీ. 'అంబ కోపింపఁ గాదను నధికు లెవ్వ'
రనుచు ముల్లోకముల నుండునట్టి యోగి
వరులు బెగడొంది యరుదెంచి 'పాహి పాహి!
శరణు శరణం'చుఁ జేరి రీశ్వరిపదముల.

వ. అంత భయకంపిత శరీరుండగు బ్రహ్మ యద్దేవిని సమీపించి యిట్లనియె:

మ. "జగదంబా! కరుణాకటాక్ష కలితా! సర్వేశ్వరార్ధాంగి! శీ
తగిరీశాత్మజ! దేవదేవి! త్రిజగత్సంపూజ్యపాదాంబుజా!
నిగమజ్ఞాన పరాయణా! భగవతీ! నిర్వాణ సంధాయినీ!
తగునే బిడ్డలమీఁదఁ గోపపడఁగాఁ? దల్లీ! క్షమంబందవే!"

వ. అని పల్కియు నద్దేవి కోపతీవ్రవేగంబునంజేసి తన్ను సరకుగొనమి నెఱింగి, విషణ్ణహృదయుండై యవ్విధాత యమ్మహాశక్తి స్వరూపంబు భక్తిచేఁదక్క నింకొండు విధంబునఁ బ్రసన్నభావంబు నొందదని నిశ్చయించి, కనులరమోడ్చి, చేతులు జోడించి, తదేకధ్యానం బగు చిత్తంబున నిట్లని ప్రార్థింపందొడంగె :

శా. "ప్రాణాయామ పరాయణుల్, నిగమ సూ
త్రజ్ఞానపారీణ గీ
ర్వాణుల్, తత్త్వవిదుల్ తపోమహిమ నా
రాధించి యెద్దాని ని
ర్మాణస్థాన లయాదికారణముగా
మన్నింతు, రా యమ్మ క
ల్యాణవ్యక్తి ప్రసన్నభావమున
లీలం బ్రోచుతన్ విశ్వమున్.

శా. తుష్టాంతఃకరణ ప్రభావగురు
చాతుర్యంబునన్ లోకముల్
సృష్టింజేయుచు, మన్పుచున్, జెఱుచుచుం
జిచ్ఛక్తి మాయాగుణా
వష్టంభోత్థిత లీలమై సకలమై
బ్రహ్మంబునై యోగి రా
డ్దృష్టంబై వెలుఁగొందు తేజమును బ్రా
ర్థింతున్ బ్రసాదార్థినై.

స్రగ్ధర. వ్యక్తావ్యక్తన్, ప్రపంచా
పనగురుతర భావప్రభావాత్మకన్,
చ్ఛక్తిన్, జ్ఞానావలంబన్,
సకలమునిగణ స్వాంతనీరేజ వాసా
సక్తన్, భాస్వద్విలాసన్,
సమధికకరుణా సాగరన్, సాత్వికోద్య
ద్వ్యక్తిన్ సేవింతు, శాంతా
పహితహృదయ భావమ్ముచే మమ్ముఁ బ్రోవన్.

పంచ. చా. చరాచరాఖిలప్రపంచ జాలమందు నిండి సా
పరాధభక్త శిష్టవర్య పాలనా విధాన స
త్వరాయమాణ చిత్తవృత్తి ధన్యమైన తేజమున్
స్మరించెదన్ ప్రసన్న భావ సంగతిన్ మముం గనన్.

మత్తకోకిల. చండముండనిశుంభముఖ్యనిశాచరప్రకరంబు దో
ర్దండగర్వ బలిష్ఠులై యతిదారుణమ్మొనరించి బ్ర
హ్మాండ భాండమునన్ జరింప మహాసమర్థత వారలన్
జెండి లోకముఁ బ్రోచు నీశ్వరి చిత్తశాంతిని బొందుతన్!

సీ. పద్మాలయా సరస్వతు లిరువంకల
దరిసి ఛత్రంబుఁ జామరముఁ బట్ట,
ఈశ్వరుండును విష్ణు వేనును దత్ప్రభ
వమ్మున కెదల విభ్రాంతి నొంద,
నిర్వాణసంధాయినీ దర్శనోత్సుక
భావమ్ములను మునిప్రతతి మ్రొక్క,
ఆనంద పరవశత్వాయత్త చిత్తులై
యోగపరాయణు లుపవిశింప,

వ. అని పల్కియు నద్దేవి కోపతీవ్రవేగంబునం జేసి తన్ను సరకుగొనమి నెఱింగి, విషణ్ణహృదయుండై యవ్విధాత యమ్మహాశక్తి స్వరూపంబు భక్తిచేఁదక్క నింకొండు విధంబునఁ బ్రసన్నభావంబు నొందదని నిశ్చయించి, కనులరమోడ్చి, చేతులు జోడించి, తదేకధ్యానం బగు చిత్తంబున నిట్లని ప్రార్థింపందొడంగెఁ :

శా. "ప్రాణాయామ పరాయణుల్, నిగమ సూ
త్రజ్ఞానపారీణ గీ
ర్వాణుల్, తత్త్వవిదుల్ తపోమహిమ నా
రాధించి యెద్దాని ని
ర్మాణస్థాన లయాదికారణముగా
మన్నింతు, రా యమ్మ క
ల్యాణవ్యక్తి ప్రసన్నభావమున
లీలం బ్రోచుతన్ విశ్వమున్.

శా. తుష్టాంతఃకరణ ప్రభావగురు
చాతుర్యంబునన్ లోకముల్
సృష్టిం జేయుచు, మన్పుచున్, జెఱుచుచుం
జిచ్ఛక్తి మాయాగుణా
వష్టంభోత్థిత లీలమై సకలమై
బ్రహ్మంబునై యోగి రా
డ్దృష్టంబై వెలుఁగొందు తేజమును బ్రా
ర్థింతున్ బ్రసాదార్థినై.

స్రగ్ధర. వ్యక్తావ్యక్తన్, ప్రపంచా
వనగురుతర భావప్రభావాత్మకన్, జి
చ్ఛక్తిన్, జ్ఞానావలంబన్,
సకలమునిగణ స్వాంతనీరేజ వాసా
సక్తన్, భాస్వద్విలాసన్,
సమధికకరుణా సాగరన్, సాత్వికోద్య
ద్వ్యక్తిన్ సేవింతు, శాంతా
వహితహృదయ భావమ్మచే మమ్ముఁ బ్రోవన్.

పంచ.చా. చరాచరాఖిలప్రపంచ జాలమందు నిండి సా
పరాధభక్త శిష్టవర్గ పాలనా విధాన స
త్వరాయమాణ చిత్తవృత్తి ధన్యమైన తేజమున్
స్మరించెదన్ ప్రసన్న భావ సంగతిన్ మముం గనన్.

మత్తకోకిల. చండముండనిశుంభముఖ్యనిశాచరప్రకరంబు దో
ర్దండగర్వ బలిష్ఠులై యతిదారుణ మ్మొనరించి బ్ర
హ్మాండ భాండమునన్ జరింప మహాసమర్థత వారలన్
జెండి లోకముఁ బ్రోచు నీశ్వరి చిత్తశాంతిని బొందుతన్!

సీ. పద్మాలయా సరస్వతు లిరువంకల
దరిసి ఛత్రంబుఁ జామరముఁ బట్ట,
ఈశ్వరుండును విష్ణు వేనును దత్ప్రభ
వమ్మున కెదల విభ్రాంతి నొంద,
నిర్వాణసంధాయినీ దర్శనోత్సుక
భావమ్ములను మునిప్రతతి మ్రొక్క,
ఆనంద పరవశత్వాయత్త చిత్తులై
యోగపరాయణు లుపవిశింప,

తే.గీ. తతమణిద్వీప బిల్వ కాంతారమధ్య
మణిమయాసనమున నుండి మందహాస
రుచులఁ బదునాల్గు లోకముల్ రూఢి నేలు
దేవి కోపంబు విడిచి శాంతించుఁగాక!"

ఉ. ఆ నియతిన్ విరించి వినయంబు,నయంబును మీఱ భద్ర సం
ధానపరాయణైక పరతంత్రమతిన్ నుతియింప, లేఁతన
వ్వానవసీమఁ గ్రమ్మ నిటలాక్షుని దేవి ప్రసన్న భావ స
న్మానము మీఱఁగా ననియె ధాతకు సర్వజగద్విధాతకున్.

చ. "ప్రతిమ యొనర్చి తొల్దొలుతఁ
బంపితి నీకడ కద్ది జీవసం
గతముగఁ జేయ నాయువొసఁ
గన్; మతినెంచక యాయువిచ్చుచోఁ
గొంతుకను జూపి శూలమునకున్
గుఱిసేసితి నాఁడు, నేఁడు నీ
గతి యగు పెంచి కోపపడఁ
గావలసెంజుమి! నీరజోద్భవా!"

చ. అనవుడు బ్రహ్మ యిట్లనియె
"నప్పుడు శూలముచేత బాలుఁ డీ
ల్గినయెడఁ బ్రాణమిచ్చి బ్రతి
కించినవాఁడను నేఁడు మూర్ఛ ము
న్గిన గణనాథుఁ దేర్పనగు?
నీవును బ్రాకృతకాంతరీతిగన్
వనటను దూలి కోపపడ
వచ్చునె లోకములెల్ల ఘూర్ణిలన్?

చ. అదియునుగాక నీవు, ఫణి
హారి, జనార్దనుఁ, డేను, లక్ష్మి, శా
రదయు నొసంగియుండిన వ
రమ్ములు వ్యర్థములౌనె? మూర్ఛలో
నఁ దవిలినంతమాత్రనె మ
నమ్మునఁ గోపమునొందె నీ వె యి
ట్లదయుతి శాప మీఁగఁదగు
నప్పుడు కాదన శక్తులుందురే?"

తే.గీ. అనుచుఁ జనవున నచియించి యవ్విరించి
మూర్ఛలోనున్న గణనాథు మోముఁ గాంచి
మంత్రములను జపించి కమండలూద
కమ్ము చిలికించి, తేనఁగాఁ గౌఁగిలించి.

ఉ. అతని హస్త మాత్మకరమందున గీల్కొనఁజేసి తెచ్చి సం
ప్రీతిని మ్రొక్కఁజేసెను విరించి జగత్పరిపాలకాచ్యుత
ధ్యాతకుఁ, జంద్రశేఖర పదార్చన పూత, కనన్య సద్గుణ
వ్రాతసమేతకున్, దుహినపర్వతజాతకు, లోకమాతకున్.

శా. డాయన్వచ్చి నమస్కరించు సుతుఁ బ్రే
డంబందు చే చేర్చి "దీ
ర్ఘాయుష్మాన్ భవ! సర్వదావిగత మా
ర్చాదిప్రమాదో భవే"
త్యాయుఃకారని రామయాదికములౌ నా
శీస్సులం గూర్చి యా
మ్నాయస్తుత్యపదారవిందయు మహా
నందంబునందుండఁగన్.

ఉ. ధాత వచించె "నీయెడలఁ దప్పని పల్కుట కాదుగాని క్రో
పాతిశయంబుచేతను శశాంకున కీ విడినట్టి శాపమున్
మాత! మరల్పఁగావలె; రమాసతిసోదరుఁడైన నీరజా
రాతి యదర్శనీయుఁ డనురవ్వకు నోర్వఁగలాఁడె చెప్పుమా!

సీ. సురలు తత్కాళ లందుచో నప్పు డాతనిఁ
గాంచకుండఁగ నుండఁగలుగు టెట్లు?
నెలనెల నాతని నెమ్మోమ్ము తీరుల
భువనముల్ సూడకపోవు టెట్లు?
ఆనందపరవశులగు వేళ దంపతు
లాతని వీక్షింప కలరు టెట్లు?
చంద్రశేఖరపాద సరసీజములఁ గొల్చు
జ్ఞాను లాతనిఁ జూడ మాను టెట్లు?

తే-గీ. ఇంత యేటికి? నిన్నుఁ బూజించునపుడు
నీ తనూజుని భజియించు నియతసమయ
మందు నాతని సరయక యుందు టెట్లు?
లట్టి మహనీయునకు శాప మర్హమగునె?

క. జనములు మేముం జూడమె!
దినదిన మీతనిని గనక తీరదు నీకున్;
జననిరో! నీ చెల్లెండ్రకుఁ
బెనిమిటి, యయ్యనఘుఁ గరుణ వీక్షింపఁదగున్."

వ. అని యనేకవిధంబుల విధాత ప్రార్థించుచున్న యవ
సరమున.

సీ. కువలయానందమ్ముఁ గూర్చెడు సొగసరి,
కలశవారాన్నిధి కడుపుపంట,
నిఖిలదేవతలకు నిరంతాన్నసంధాత,
యమరద్రుపద్మాలయానుజుండు,
సకలకళారాశి, సన్నుత ద్విజరాజు,
పద్మాయతాక్షుని బావమఱఁది,
చల్లనిచూపుల జనులఁ జూచెడు రాజు,
సర్వేశ్వరునకును సడ్డకుండు,
తే-గీ. మన్మథుని మేనమామ, సన్మార్గవర్తి,
భవుని తలమానికంబు, జైవాతృకుండు
చంద్రుఁ డరుదెంచి, 'మాం పాహి శరణ' మనుచు
సర్వమంగళ పాదాంబుజముల వ్రాలి,
చ. "సొగసరియంచు నీసుతుని
జూచితి; నంతియ కాని వానిపైఁ
బగ గలదమ్మ? 'సుంకరుఁడు
బాలుఁడు; పార్వతిపుణ్యమెల్ల నీ
పగిదిఁ గుమారుఁడయ్యె'నని
పల్కితి; నంతియ కాని మూర్ఖతోఁ
దగులఁగఁ గోరినానటవె?
తల్లి! యిదేటికి శాపమీయఁగన్!
ఉ. చక్కనివాఁడు, కాంతి వెదఁ
జల్లెడువాఁడును గానుపించుచో
నక్కజమంది లోకులు త
దాననమున్ గనుచుంట నైజ; మా

ఫక్కి నె నేనుజూచితిని;
ప్రాకృత కర్మ మదేమొకాని వీఁ
డక్కట మూర్ఛనొందె; నది
యంబిక ! నాయెడ దోషమగాన టే ?
ఆ-వె. విను 'మదర్శనీయుఁ' డనుమాట భరియింపఁ
జాల; జనులు దిట్ట సైపఁజాల;
తప్పుసేయ లేదు; దండనార్హుఁడఁగాను;
వేఁడుచుంటి; శాప భీతి మాన్పు.
మ. అభయంబి; మ్మిడిసట్టి శాప ముపసం
హారంబుగా విఁపు మం
బ ! భవానీ ! శరణాగతుండనుజుమీ !
మాం రక్ష మాం రక్ష" యం
చు భయార్తిం దన పాదపద్మములపై
శోషిల్లు చంద్రున్ గృపా
విభవస్ఫూర్తిని జూచి దేవి యెదలో
వేమాఱుఁ జి లింపుచున్.
మ. "అనఘా ! నావచనం బమోఘు; ముపసం
హారంబుఁ గావింపఁగా
నను వో పద్ధతి కానుపింప; దయినన్
వ్యాహార భేదంబుఁ గ
ల్పన నేఁ జేసెద; నీచతుర్థిని నినున్
లక్షించువారెల్ల నిం
దను బొందంగల" రంచుఁ బల్కెను బ్రస
న్నత్వంబు దీపింపఁగన్.

వ. అట్లు దేవదేవి యనుగ్రహింప నెల్లవారు 'నొకనాటి కేమగు' నని తృప్తివడిరి. చంద్రుండును 'వత్సరంబున నొకనాఁ డెనిమిది గడియలకాల మే ఘనుని యండఁ జేరి యయిన దాఁగికొనెదఁగాక' యని సంతుష్టుండయ్యెఁ. బిదప నెల్లరు నిజగృహంబుల కరిగి"రని యక్కథకుండు సూతుండు నకాంక్షింప, మానీశ్వరులు. "మహాను భావా! నీ యనుగ్రహంబునంజేసి మహానుభావుండగు వినాయకచరితం బాలించితిమి. నీకు వందనశతంబు లర్పించుచున్నారము. కాని నేఁటికైనను భాద్రపదశుద్ధ చతుర్థిని జంద్రునిం జూచిన నీలాపనిందలు నప్పకుండునా? లేక యద్దాని కెద్దియేని శాంతి కలదా?" యని యడు గుటయు సూతుండు పులకితగాత్రుండై "తచ్ఛాంతి విధంబు శ్రీమన్నారాయణుండగు శ్రీకృష్ణుంచే నిర్ణయింపఁ బడిన"దనియె; నంత నెల్లరు నక్కజంబంది, "అదియట్లు సంభవించె? నేతత్కథా విధానంబు వాక్రుచ్చి మమ్ముఁ బావనులను జేయుమా"యన-

4

మ. "తనివారన్ గణనాథ జన్మవిధ ము
ద్యద్భక్తి విన్నన్ బున
ర్జననం బుండదు; కల్గెనేని గజవ
క్త్రి బుం, త్రిశూలాది సా
ధనసంపత్తి, భుజంగభూషణములున్,
త్రైలోక్యసామ్రాజ్యపా

లనముఁ, శంకర శాంకరీప్రణయమున్
లక్ష్యంబు లప్పట్టునన్.

క. దానికిఁ దోడుగ హరికథ
వినులఁ బడెనేని ఫలము వినిపింపఁ దరం
బౌనే” యని సూతుఁడు న
మహామునులకుం దెల్పఁదొడఁగె మరల నిటులుగన్

శా. “దేవీశాపభయంబుచే గణపతు
ర్థిన్ లోకు లానాఁటి శ
ట్లో వేఁగింతురు, నాఁటిసంధ్య; పొరపా
టుం జెంది వీక్షించినన్
శాపం దిట్టుదు రా శశిన్; జలదసం
ఛన్నుండుగా నున్నచో
నేవాదుం బడకుండఁ దేలెదమునుం
డీ! యందు రందందునన్.

ఉ. దాఁగుదు రిండ్ల మూలలఁ; బ
థంబుల నుండఁ దటస్థమైనచో
నేగుదు రా సమీపమున
నెచ్చటనైనను జాటుగల్గినన్;
వేగుదు రాత్మభీతి నొక
వేళఁ గనంబడునో యటంచు; లోఁ
గ్రాగుదు రిట్లు లెల్లరును
గంజవిరోధిని జూడనొల్లమిన్.

చ. ఎవరికి నిందవచ్చిన ‘ని
సీ! గణనాథచతుర్థిఁ దారకా

ధవుఁ గని తెచ్చుకొంటి మిది,
దాఁటుట యెట్లని ఖేదమొంది, యు
త్పలవలయనాథుఁ దిట్టుదురు
'క్రూరతరంబుగ నంబ శాప మీ
యవలెనె? యెవ్వరేని సభ
యంబిడరాదొకొ!' యందు రయ్యెడన్.

వ. ఇట్లు చంద్రుం జూడ వెఱచి జనమ్ములు దురపిల్లు కాలంబున.

ఉ. ద్వారక నుద్భవించె బల
దర్పిత శత్రువిదారి, సంశ్రితా
పారమహోపకారి, సుర
వార ఘృణాపరిహారి, గోకులాం
భోరుహలోచనాహృదయ
మోహనకారణరూపధారి, కం
సారి, రమాహృదంతరవి
హారి, మురారి, దితారి యయ్యెడన్.

వ. అటు లుదయించి, జగద్ధిత లీలావిలాసంబులఁ గావించుచు మెలంగుచుండి, కొండొక కాలంబున గణచతుర్థి దివసం బరుదేర నానావిధంబుల విఘ్ననాథునిఁ బూజించి తత్సాయంసమయంబున ధేనువులం బిదుకుచుఁ దత్ క్షీర పూరితంబగు ఘటంబున.

మ. కనియెన్ శౌరి కళాచతుష్టయ శుభా
కారున్, సుధామధురీ
ఘనసంబంధి శరీరుఁ, బశ్చిమదిశా
కాశప్రభాధారు, స

ర్వనిలింపౌఘమహోపకారు, వరదీ
వ్యత్తారకాజారుఁ బా
ర్శ్వనియుక్తాంచిత శృంగధారు, బహుధా
సన్మార్గ సంచారునిన్.

చ. పిదికిన పాల నిట్లు ప్రతి
బింబితుఁడై యుడురాజు తోఁప, "నే
యదనున నెట్టినిందఁ దన
యందున మోపుదురో జనమ్ము? ల
ట్లొదవిననాఁడు దాఁటఁగల
నో?" యని శౌరి యనేకరీతులన్
మదిఁ దలపోయుచుండె నను
మానపరీవృత చిత్తపద్ముఁడై.

ఉ. "పాలనుగాదె చూచితిని?
వాదు జనించునె దాన? నింతకున్
బేలతనంబుచేత నొక
వేళ జనుల్ పొరపాటునొందినన్
దాలిమి వారి యూహలను
దప్పని చూపఁగలేనె?" యంచు లో
శ్రీలలనామనోహరుఁడు
చింతిలుచుండెను; నంత నవ్వారిన్.

శా. సత్రాజిత్తనువాఁడు సూర్యు వరిస
స్యన్ దన్పుటన్ దడయూ
పాత్రుండై వరమంది తెచ్చెను ప్రభా
వస్ఫార కాంతిచ్ఛటా

గాత్రప్రోత్థిత భానుమంతము, కన
ద్గాంగేయ దానక్రియా
స్తోత్రానంతము నా శమంతము లస
చ్ఛోభాపహృద్ధ్వాంతమున్.

క. ఆ మణిఁ దాల్చి మహోజ్జ్వల
భాముండై యతఁడు రాఁగ, ద్వారకను జన
స్తోమమ్ము 'సూర్యుఁ డెందుల
కో మన నగరమ్ము చాయకు న్వచ్చె'ననన్.

క. అత్తరి హరి యనియెను "మీ
రి త్తెఱఁగున భ్రాంతినొంద నేటికి? రవి ద
త్తోత్తమమణియుత సత్రా
జిత్తుఁ డతఁడు; వెలుఁగు మణివిశేషము సుండీ!"

వ. అని పల్కి యమ్మహానుభావుఁడు వారల సందియం బపనయించెఁ; బదపడి సత్రాజిత్తుఁడును శుభముహూర్తంబున గృహప్రవేశంబు సేసి, శమంతంబును బవిత్రస్థలంబున నుంచి పూజించుచుండె; అదియును దినదినమెనిమిది బారువులు శుద్ధసువర్ణంబు వర్షించుచుండె; ఇట్లు మణిమహత్త్వ ప్రవర్తిత కనకసంభార బహుళీకృత సంపన్నుండై, సత్రాజిత్తు సంతసించుచుండు నెడ.

ఉ. "ఆ మణి, రాజశేఖర గృ
హాంగణభూములఁ బూజలందినన్
క్షామము, రోగభీతియును,
జంతుభయాదులు, నీతిబాధలున్

భూమిజనంబుఁ జేర; వది
భూవరుఁ జేస్ప"మటంచు శౌరి త
ద్ధామము సేరి చెప్పఁగ న
తండును లోభగుణంబు పెంపునన్.

క. "అనుదినము నిల్లు నిండఁగఁ
గనకము వర్షించు మణులు గానుక యుంచున్
జనపాలుని కర్పింతురె ?"
యని కృష్ణు నిరాకరించి యునిసి మనమునన్.

క. తలపోయఁ దొడఁగెఁ "గృష్ణుఁడు
బలవంతుఁడు; చలముపట్టి బాధించునో ? యె
వ్వలనఁ దఱివేచి మోసము
వెలయఁగ మణిఁ గొనునో ?" యనుచు విపరీతమతిన్.

వ. ఈరీతి సత్రాజిత్తుం డనుమానసంకలితచిత్తుండై యుండఁ గొంతకాలంబు గడచె; అంత నొక్కనాఁ డాతని యను జుండు ప్రసేనుండనువాఁడు—

మ. మృగయాఖేలన తత్పరుం డడవిదా
రిం బోవుచో రత్న మా
త్మగళమ్మందు ధరించె; దానిఁ గని సిం
హ మ్మొక్కఁ డేతెంచి వా
ని గతాయుష్కుని జేసి యామణిఁ గొనెన్;
వెన్వెంట నాసింహమున్
దగ మర్దించి హరించె బుఋక్షము శమం
తంబున్ ప్రభావంతమున్.

వ. అట్లు భల్లుకేశ్వరుండయిన జాంబవంతుం డామణిం గొని చని తన గృహాభ్యంతరమున నాత్మపుత్త్రికయుఁ బరిపూర్ణ యౌవనయు నగు జాంబవతికి వినోదార్థముగా హంసతూలికాతల్ప సమీపంబున వ్రేలఁగట్టె; అంత నిక్కడ సత్రాజిత్తుండును దన తమ్ముం డెంతకు నిల్లు సేరమికిం జింతించి వెదకించి యడవిని నతండు మడియుటయు, శమంతం బపహృతం బగుటయు నెఱింగి శోకలోభమ్ములం గ్రమ్మి వివేకంబు వీడి,

ఉ. "ఏ ననుమాన మొందినటు
లే తుద కైనది; పొంచిపొంచి యె
ట్లేని మణిన్ హరింతునని
యెంచి ప్రసేను వధించినాఁడు నేఁ
డీనియతిన్ జనార్దనుఁ డి
సీ" యని నిందలఁ బర్వఁజేసి లో
లోనఁ దపింపఁ దత్ప్రకృతి
లోభగుణాంబుఁ దలంచి కృష్ణుఁడున్.

ఉ. 'తోయజశాత్రవున్ గనుచ
తుర్థిని జూచిన యాఫలంబు క
ట్టా, యిటు వచ్చె'నంచు హృద
యంబున నొప్పి జనింప, 'దీని నేఁ
బాయు నుపాయ' మేదనుచు
భక్తి నిటుల్ స్మరియించె భద్రసం
ధాయకు, విఘ్ననాయకు, వి
నాయకుఁ, గార్యఫలప్రదాయకున్.

మ. "సుకుమారావయవమ్ములన్ మహితమై
శోభిల్లు భూషాళితోఁ,
బ్రకటాంచన్నవరత్న సంస్థగితమా
భాస్వత్కిరీటంబుతో
నకలంకాకృతి భక్తహృజ్జలజమం
దాటాడువాని న్వినా
యకదేవున్ మహనీయు సర్వమయునిన్
ధ్యానింతు నశ్రాంతమున్.

మ. సరసీజాసన వాసవాద్యమరు ల
శ్రాంతంబుఁ బూజింప, సా
దరసమ్మోదనిమగ్న హైమవతి చెం
తన్ నిల్చి యుప్పొంగ నీ
శ్వరుఁడున్ శీవికిఁ బ్రాభవంబున కెనన్
సంతోషముం జెంద స
త్పరిషన్మధ్యమునందు నుండు ప్రభువున్
ధ్యానింతు నెల్లప్పుడున్."

వ. అని ధ్యానించి వెండియు నిట్లనియె.

క. "సురసిద్ధసాధ్యవందిత
చరణాంబుజ! నీచతుర్థిఁ జంద్రునిఁ గనఁగా
నురునింద వచ్చె; నిపు డే
తెరువున దాఁటంగలాఁడఁ? దెల్పంగలవే!

మ. తొలుదొల్తన్ నినుఁ బూజసేసితిని; సం
తుష్టాంతరంగుండవై
ఫలముంగూర్చుట మాని, నిందలఁ దలన్
వైవంగ న్యాయంబె? ని
ష్ఠలతేజోనిధి! దీని దాఁటు తెర వే
దో నాకు బోధింప రా
వలదా, నన్ను ననుగ్రహింపవలదా
ప్రత్యక్షరూపంబునన్ ?"

మ. అని శ్రీనాథునియంతవాఁడు మదిలో
నర్చించె దీనాశ్రితా
వనమోదమ్ముల, నాత్మతత్త్వమహిమా
వాగ్బృంద వేదమ్ములన్,
ప్రణవానోదములన్, విరించికృతస
న్మస్తోత్ర నాదమ్ములన్,
దనుజోన్మూలన సింహనాదముల, వి
ఘ్నస్వామి పాదమ్ములన్.

మ. అనఘుం డాతఁడు పిల్చుమాత్రమున వి
ఘ్నాధీశ్వరుం డంత వే
చని కాంచెన్ యదువంశబాలుని, సదా
చారప్రధానైక శీ
లుని, జక్రాదివరాయుధప్రకర సి
ద్ధానద్విషద్దైత్య జా
లుని, బీతద్యుతిచేలునిన్ ఘనకృపా
ళున్ రుక్మిణీలోలునిన్.

క. కని యిట్లనియెం "గృష్ణా!
వనజోదర! లోకములకు వనటఁ దొలంగిం
పను జనియించిన నీవే
యనుచితముగఁ జింతనొంద నగునే చెపుమా!

చ. సమదరిపువ్రజంబులను
జంపఁగ నెంచి కృపన్ మహావతా
రములను దాల్చి లోకులఁ ది
రంబుగఁ బ్రోచెడు నీవె యాగతిన్
భ్రమఁగొనె దేల మాటికిని
బ్రాకృత పూరుషునట్లు? నింద య
క్రమముగ వచ్చె; దాఁటి చన
గా నదుపాయము నీ వెఱుంగవే?

క. అదికాక నింద నీ కి
ట్లొదవుట జగములకుఁ గొంత యుపకారము; నీ
వుదయ మయినట్టి పని కి
ట్లదియిది తోడగుచునుండు నంబుజనాభా!

తే-గీ. పయనమైపొమ్ము వెంటనే వనమునకును;
గార్యసాధనమందునఁ గానుపించు;
నీకుఁ గళ్యాణసంసిద్ధి నెగడుఁగాత!"
మనుచు విఘ్నేశ్వరుం డేఁగు ననసరమున.

వ. పూర్వము గోవర్ధనం బెత్తునపుడు దన కింద్రుండొసంగిన చింతామణిదామమ్ము నా రమానాథుఁడు గణనాథుని కంఠసీమ నలంకరింపఁజేసి, తత్సౌందర్యరమ కచ్చెరువొంది, "దేవా! నేఁడు మొదలుగా నీవు చింతామణి గణ

నాథుండు. సౌందర్యరమానాథుండు నను నామంబులతో
భక్తులచే సేవింపఁబడుచు వారి కఖిలార్థమ్ము లిచ్చు
చుందువు గాక” యని ప్రార్థించి, నమస్కరించి, యాతని
వీడుకొలిపి,

ఉ. ఆతని మాటలన్ వెలయ
నర్థము లోన నెఱుంగుటన్ యశో
దాతనయుండు తల్లికిని
దండ్రికి నర్మిలి మ్రొక్కి, విప్రయో
గాతిశయంబు నోర్వని ప్రి
యాంగనలన్ దగురీతిఁ దేర్చి, సం
ప్రీతిఁ బ్రయాణమయ్యె నట
పీస్థలికిన్ దగువారు వెంటరాన్.

వ. అట్లు ప్రయాణమై చనిచని యెట్టకేల కొకచో హర్యక్ష ఖర నఖర విదళితంబగు ప్రసేను గాత్రంబును, నతని యశ్వంబు గాత్రంబును బొడఁగని, కొంతవోక మార్గంబునం గల రక్తసిక్త పాదచిహ్నంబులం జూచి, యది యామృగ రాజ మేగిన కాలిజాడఁగా నిశ్చయించి, యమ్మార్గంబునం బోయి యచ్ఛభల్ల వినిహతంబైన యప్పంచాస్యంబును దిలకించి, యా భల్లుకేశ్వరుని కాలిజాడ యడియాలంబుగాఁ జనిచని తుట్టతుద కొక గుహాద్వారము సరసి, తత్సమీపంబున ననుచరుల నిలువ నియోగించి తానొక్కరుండ లోనికిం జని జాంబవతి యూఁగు తూఁగుటుయ్యాల ప్రక్కను వ్రేలుచున్న ప్రభాక్రమిత దిగంతమగు శమంతకముం జూచి,

తే-గీ. పాదములు మెల్లగానిడి వంగివంగి
చని శమంతము సంధింప శౌరి హస్త
పద్మములఁ జాఁచినంతనె భల్లుకము మీఱ
దాసి కుయ్యిడె గుహ ప్రతిధ్వనులనీన.
ఉ. అంతట జాంబవంతుఁడు ర
యంబున వచ్చి విరోధమత్సర
ధ్వాంత పరీతచిత్తుఁడయి
దానవభంజనుఁ బోల్పలేక, వి
క్రాంతిమెఱంగఁ దాఁక, రణా
రంగవిహారి మురారి యాతనిన్
బంతముమై నెదిర్చెఁ దత
బాహుబలంబుఁ, బలంబుఁ గన్పడన్.
క. తమకము, పగ నెక్కొన ఖ
డ్గములను వృక్షముల రణముఁ గావించు క్రమ
క్రమమున నియుద్ధమునకు న
హామహామికం గడఁగి రిర్వు రతిరభసమునన్.
శా. బాహాబాహిని బోరిపోరి పిదపన్
భల్లూకనాథుఁడు త
ద్బాహౌద్ధత్యము, దివ్య తేజమును, స
త్త్వస్ఫూర్తి వీక్షించి "సం
దేహం బించుక లేదు; శ్రీహరి యితం
డే; కానినాఁ డేరు నా
దేహంబున్ బొడిసేయఁజాలు ఘన శ
క్తిం గాంచువా"రంచు లోన్.

క. తలఁచి వినమ్రుండై, చే
తులు మోడిచి "దేవదేవ! దురితాత్ముఁడ; ని
న్నలయించినాఁడ! మూఢుఁడ;
ఖలుఁడను; గోపింపఁబోకు కంజదళాక్షా!

మ. విధిఁగన్బ్రిమి దురాశుండయి, చతు
ర్వేదమ్ముల్ గొంచు నం
బుధిమధ్యంబున డాఁగినట్టి దనుజన్
బోకార్ప మత్స్యస్వరూ
పధరుండైన మహానుభావుని జగ
ద్వంద్యున్ నినుం గాంచి నేఁ
డధికంబౌ ఫల మింకఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

శా. ప్రాణాధార సుధావతారమునకై
పాథోధిమూథాను సం
ధానప్రోత్థితకార్యులైన సురదై
త్యశ్రేణి భీతిల్ల సం
ద్రానన్ మున్గుచునున్న మంథరము నె
త్తం గూర్మమైనట్టి ని
త్యానందాత్మకు నిన్నుఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

మ. జవసత్త్వంబులఁ గ్రొవ్వి దుర్జయ వర
స్వాతంత్ర్య సంపూర్తిచే
నవనీకాంతకు నెగ్గుసేసిన హిర
ణ్యాక్షు న్వధింపంగ య

జ్ఞవరాహాకృతిఁ దాల్చినట్టి సరసీ
జ ప్రోద్భవస్తుత్యు ను
త్సవమారన్ నినుఁ జూడఁగంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

శా. భక్తాగ్రేసర చక్రవర్తిని సుతున్
బ్రహ్లాదు హింసించు దు
స్సక్తాచారమతిన్ హిరణ్యకశిపున్
జంపన్, గుమారావనా
సక్తిన్ మానవసింహరూపము మహా
శ్చర్యంబుగాఁ గొన్న నిన్
వ్యక్తావ్యక్తు ననంతుఁ జూచితి మహా
త్మా! శ్రీరమావల్లభా!

మ. బలదర్పోద్ధతి దిక్పతిప్రకరమున్
భంజించి సర్వాధికా
రలసద్గౌరవ మందుకొన్న బలిఁ గా
ర్యస్ఫూర్తి నిర్జించి ని
స్తులసామ్రాజ్యము నన్న కిచ్చిన యుపేం
ద్రున్ వామనాకారు ని
ర్మల కంజాక్షుని నిన్నుఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

మ. కపటక్షాత్ర మదాపహారవిధముం
గావించి తద్రక్తసి
క్తపృథుక్షోణిభరంబుఁ గశ్యపునకున్
దానంబుగావించి శా

శ్యపి నా భూమికిఁ బేరుఁదెచ్చిన కుతా
రాయత్తహస్తున్ సమ
స్తపవిత్రాత్మకు నిన్నుఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

శా. సాధుద్వేషకు, శాంతిశోషకు, మహా
సాధ్వీసతీదూషకున్,
క్రోధావిష్టుని, విక్రమోన్నత భుజా
కుంతప్రభావున్, జగ
ద్బాధాకారణు రావణుం దునిమి నన్
బాలించియున్నట్టి భ
క్తాధీనున్ నిను రాముఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

శా. కంసాది ప్రతివీరులం దునిమి భూ
కాంతాభరం బూడ్చియున్
హింసాపాతక రాక్షసాంశజుల మా
యింపంగఁ బాండూద్భవో
త్తంసుం గూడి చరించుచున్న మహితుం
దైత్రిలోక్యసంపూజ్య సో
హంసోహమ్మని నిన్నుఁ గంటిని మహా
త్మా! శ్రీరమావల్లభా!

*మ. కలి వర్ణాశ్రమధర్మకర్మము లడం
గన్ సత్యశౌచక్రియా

* కల్కిమూర్తి వగుదువని సద్యోజనితమగు దివ్యదృష్టివలన నెఱింగి చెప్పెను.

కలనా శక్తి విహీనమై చనఁగ దు
  ర్గర్వంబునన్ మించి మ్లే
చ్ఛులు బాధింపఁగఁ, గల్కిమూర్తివగు నిన్
  శుద్ధుర్ ధృతాసిన్ విని
ర్మలధర్మున్ విజితారిఁ గంటిని మహా
  త్మా! శ్రీరమావల్లభా!"

వ. అని జాంబవంతుండు పూర్వ పుణ్యసంబంధంబునం జేసి సంస్తుతించి యశోదానందను పాదంబులన్ వ్రాలి.

ఆ-వె. "జగములకును నెల్ల జవసత్వములు నీవ;
ప్రాణికోటి కెల్లఁ బ్రాణమీవ;
ప్రకృతివీవ; యాత్మ, పరమాత్మయును నీవ;
నన్ క్షమింపు మో యనాథనాథ!

చ. తెలియమి నెగ్గుసేసితిని;
  దీనుఁడ; నీ చరణాంబుజంబులన్
గొలిచినవాఁడ; నాయెడలఁ
  గోపమునందకు" మంచు భక్తిమై
నిలిచిన భల్లుకేశ్వరుని
  నెయ్యముమీఱఁ గవుంగిలించి యా
నళిన దళాయతాక్షుఁడు ఘ
  న ప్రమదోచిత మందహాసుఁడై.

వ. అతని శరీరంబు నిజమృదుకరకమలంబుల నివురుచు మధుర భాషణంబుల నిట్లనియె.

తే-గీ. "తాత! వినుమయ్య! యీశమంతకము నేనె
యపహరించితి నని మాఘు లనుటఁ జేసి

నిండ సైరింపలే కిట్లు నీగుహాగృ
హమ్మునకు మాకు రానున వయ్యెఁ జుమ్మ.

తే-గీ. అదియునుంగాక మున్ను రామావతార
సమయమున 'నీకు నేమి యిష్టమ్మొ తెలుపు,
మనఁగ నాతోడి సంగర మాసపడితి;
వదియు సిద్ధించె నేఁడు భల్లాధినాథ!"

చ. అనవుడు జాంబవంతుఁడు ము
దశ్రులు నేత్రములందు నిండ కృ
ష్ణుని గని, "దేవకీసతి య
శోదకు నంపిన పిన్నవాఁడ! నన్
గనుగొనవచ్చినాఁడవె? య
నంత! పరాత్పరమూర్తి! యేయుపా
యన మిడువాఁడ" నీకనుచు
నాత్రము భక్తియుఁ బొంగి పాఱఁగన్.

తే-గీ. తన యనుంగుతనూజ సౌందర్యరాశి
జాంబవతినామకన్య నచ్చటికిఁ బిలిచి
ప్రియము సెలువార 'నీ వెను స్వీకరింపు'
మనుచు శ్రీహరి కాబాల నప్పగించి.

వ. శమంతకమణికిఁ దోడుగా ననేకానర్ఘమణులను, గన్యకా
మణి నిచ్చి జాంబవంతుండు శ్రీహరి నంపె; అంత ద్వార
కానగరంబున నిరువదియెనిమిది దినంబులైనను గృష్ణుండు
మరలి రాకుండుటకుఁ గతం బరయ నేరక యెల్లవారును
కేవల కరుణాపాంగవీక్షణసంరక్షితభక్తవర్గ యగు
దుర్గను బూజాదులచేఁ దనుప, నామెయు వారివలన.

ప్రసన్న భావంబు నంది, యశరీర వాణీవిశేషంబున నిట్లనియె.

తే–గీ. "ఆత్రపడ నేల ? జనులార ! యతని కెందు
నెగ్గు పుట్టునె ? వినుఁడు, నేఁ డెల్లిలోన
మణినిఁ గన్యామణిని గొంచు మాధవుండు
వచ్చుచున్నాఁడు; భయపడ వలదు మీకు."

వ. అట్లు దేవి వక్కాణింప నెల్లవారును సంతసించి; రంతఁ గృష్ణుండును జాంబవతీసమేతుండై యరుదేర ద్వారకానగరంబెల్లఁ జంద్రోదయసమయార్ణవంబున కుద్దియయ్యెఁ; దదుపరి యదువృష్టిభోజాంధకప్రముఖుల నెల్లర రావించి యొకసభఁ గావించి యప్పరిషన్మధ్యమునకు సత్రాజిత్తును బిలువంబంపి యెల్లవారును విన నాతనితోఁ గంసమర్దనుం డిట్లనియె.

చ. "వరమతపో నియామకము
వాటిల సేవలఁ జేసిచేసి యం
బరమణి హృష్టుఁజేసితి ; శ
మంతముఁ దెచ్చితి ; వంతెకాని త
ద్వరమణి నెట్లు భద్రపఱు
పఁగవలెనో యొకయించుకేని నీ
వరయమి దానిఁ గోల్పడితి;
వా కథఁదెల్పెద నాలకింపుమా !

తే–గీ. అతుల శుచిమంత మీశమంతాఖ్యరత్న ;
మశుచిమంతులు ధరియింప ననువుపడదు ;

కాన వేఁటాడు వేళఁ బ్రసేనుఁ డిట్టి
దివ్యమణిఁ దాల్చి మృత్యువుఁ దెచ్చుకొనియె.

చ. అదను నెఱింగి సింహము ర
యంబున వాని వధించి నోట నీ
సదమల రత్నమున్ గొనుచు
సాగ శుచిత్వము వాసె దాని ; న
ట్లొదవుట జాంబవంతుఁడు మ
హోగ్రనఖంబుల దాని జంపి స
మ్మదమున రత్నమున్ గొనియె ;
మర్మమెఱుంగక యొండ్లఁ దిట్టెదే !

కం. అనుమాన మనుచితంబగు ;
అను యుక్తాయుక్త మరసి ; యనుచితమగు వా
దును దప్పుకొనఁగ నిరువది
యెనిమిది దివసములు పోరు లెసఁగెను జుమ్మా !"

వ. అని యేతద్వృత్తాంతంబు సాంతంబుగా నుపన్యసించి, సత్రాజిత్తున కాశమంతము నొసంగి యనుప, నాతండును వ్రీడావనతవదనుండై నిజగృహంబునకుం జని.

క. "ఇతరుల పాపంబుల బా
ధితములఁ జేయంగఁజాలు దీనశరణ్యున్
మతి నెంచక యెగ్గాడిన
పతితునకై యెట్టి నరక వాసము గలదో !

శా. శౌరిన్ దీనశరణ్యు నచ్యుతునిగాఁ
జర్చింప ; నెగ్గాడి యా
చారం బీగతి నీగినాఁడ"నని ప
శ్చాత్తాప బాధాపత
ద్భారంబున్ భరియింపఁ జాలమిని స
త్రాజిత్తు రేయుంబవల్
సారంబేది, యెటేనియున్ మురహరున్
శాంతాత్ముఁ గావింపఁగన్.
తే-గీ. నిశ్చయించి కుమార్తెను నిపుణమతిని
సత్యభామను గొని తెచ్చి శౌరి కిచ్చి,
'హరణ' మంచు శమంతక మప్పగింప,
నగుచు నాతని కనియె నా నాగశాయి.
క. "నూత్నమణు లున్న వింటఁ; బ్ర
యత్నముచే వచ్చు నింత కధికము; నాకున్
బత్నిగ నిచ్చిన కన్యా
రత్నమె పదివేలు; కొనుము రత్నము నీవే."
క. అని సత్యభామఁ గైకొని
వనజాక్షుఁడు రత్నమిచ్చి పంపె నతని; న
య్యనఘుఁడు "సర్వేశ్వరు శాం
తుని జేసితి"నంచుఁ జనెను దోరపుబత్తిన్.
తే-గీ. అంత రుక్మిణి యురుబెంచి కాంతుఁ గాంచి
"యిట్టి నిందలఁ బడవచ్చు నెన్నియేని"
ననుచుఁ బరిహాసమాడఁగా, వనజనాభుఁ
డామెతో నిట్టులనియె నెయ్యమ్మె మెఱయ.

ఉ. సుందరి రాయబారములఁ
జొప్పడనంపెడు; నీరజాయతా
క్షిం దనియింపఁగావలయుఁ;
జిత్తములోపలఁ గష్టమెంచ కే
నిందల మోయఁగావలయు;
నిశ్చయమాడితి; కాని నాఁడు మీ
యందఱ కందక త్తెలకు
నాపుడు నెట్లగుదు స్వచింపుమా!"

వ. అని యామెకు సరసోక్తులఁ బ్రత్యుత్తరం బొసంగి.

తే-గీ. "గణచతుర్థిని జందురుఁ గాంచువారు
నిందలను బొందువా రని నిఖిలజనని
శాపమిడియెను; నేఁ బాలచంద్రుఁజూచి
నాఁడ; నిందల నందినవాఁడఁ జెలియ!"

చ. అనవుడు రుక్మిణీరమణి
యాతనిఁ జూచి వచించె "దేవ! నీ
వనిన మహానుభావుఁడ వ
నంతుఁడ వాద్యుఁడ వవ్యయుండవున్
గనుక నెఱేనిఁ దప్పుకొనఁ
గల్గితి వియ్యది; లోకు లిట్టి నిం
దను నిఁకనొందకుండ నొక
దారిని బెట్టఁగరాదె చెప్పుమా!"

క. నావుడు మహానుభావుఁడు
దేవుఁడు కృష్ణుండు పలికె, "దేవీ! కైలా

సావాసిని శాపంబున
కే వినిపించెదను శాంతి; నేర్పడ వినుమా!

సీ. తొలుదొల్త నీశ్వరు కొలువును వర్ణించి
ముక్తిమార్గములందుఁ బొందుపఱిచి,
ఆపై నగాత్మజాభ్యంజనాదులఁ దెల్పి
ప్రతిమగల్గినయట్టి ప్రకృతిఁ జెప్పి,
ప్రతిమయు బ్రహ్మచేఁ బ్రాణమందుటఁ జూపి
తనయుఁ డీశ్వరుఁ దాఁకుటను ఘటించి,
బాలుఁ డొందినయట్టి ప్రాణవిఘ్నము వల్ల-
వాఁడు జీవించిన వార్తఁ దెలిపి.

తే-గీ. అతని లాలించి మూర్తిత్రయమ్ము, వారి
భార్య లిచ్చిన వరముల వరుస నుడివి
గణచతుర్థి మహత్త్వంబు గణనఁ జేసి
వెలయు పూజాది విధముల విశదపఱిచి.

క. ఆ పర్వమందుఁ జంద్రుఁడు
శాపంబొందిన తెఱంగు జతపఱిచి సతీ
కోపోపసంప్రాప్తియుఁ ద
చ్ఛాప సమయనిర్ణయముల సమకూర్చి పయిన్.

సీ. గణచతుర్థిని నేను గైరవాప్తునిఁ జూచి
నిందనొందినరీతి నెఱి వచించి,
ప్రమథనాథుఁడు నాకుఁ బ్రత్యక్షమై యుప
దేశించిన తెఱంగుఁ దేటపఱిచి,

తతశమంతకథా విధానంబు వాక్రుచ్చి,
దాని నేఁదెచ్చుటఁ దనరఁజెప్పి,
భల్లపుత్త్రి సత్యభామల కళ్యాణ
విధములఁ దగురీతి విశదపఱిచి,

తే-గీ. ఘనతఁ జెందు పురాణంబు ఘనఫలప్ర
దంబు కలినాశకంబు తత్త్వప్రబోధ
కంబు భక్తిప్రధానంబు గణచతుర్థి
నాలకించెడు ఘనపుణ్యశీలురకును.

క. చంద్రుఁ బ్రమాదవశమున
సందర్శించినను సాహసము కల్మిని జూ
డం దలకొనినను సరియే
నిందలు రా వింక వినుము నీరజనేత్రా!

వ. నాకుం గార్యసిద్ధియు, గల్యాణసిద్ధియు నొనకూర్చెఁ
గావున వినాయకుని గణచతుర్థినాఁడు భక్తులు సిద్ధి వినా
యక నామంబునఁ బూజించువారు.”

సమాప్తము